శ్రీః

# సస్యానందము

(దోనయామాత్యప్రణీతము)

తెనుగు తాత్పర్యము - సంగ శేషాచలశాస్త్రి

పరిష్కరణ - పీఠిక

**ఉన్నం జ్యోతివాసు**



ప్రకాశకులు

శ్రీమతి రావి కృష్ణకుమారి

404, జంజనం కాంప్లెక్స్. చీరాల.

శ్రీః

# సస్యానందము

(దోనయామాత్యప్రణీతము)

తెనుగు తాత్పర్యము - సంగ శేషాచలశాస్త్రి

పరిష్కరణ - పీఠిక - **ఉన్నం జ్యోతి వాసు**

ప్రతులు : 500
ప్రథమ ముద్రణ : దీపావళి - 2016.
పుటలు : 100
వెల రూ. : 60-00


404, Janjanam Complex,
Opp. I-Town Police Station,
**CHIRALA** - 523 157. **Cell : 94401 15411**

D.T.P.:
**P. PARVATHI**
CELL: 7416586775.

Printed at :
**KARSHAK ART PRINTERS**
Hyderabad.



## శాసనాత్ శంసనాత్ శాస్త్రం శాస్త్రమిత్యభిధీయతే

విధులను శాసించుట, విషయాలను ప్రకటించుట – ఈ రెండు పనులు చేయువాటిని శాస్త్రాలు అంటారు. ఇవి లోక ప్రయోజనం కోసం పుట్టాయి. ఎన్నో తెలియని విషయాలను తెలియజేస్తాయి. హితోపదేశకర్త శాస్త్రప్రశస్తిని అద్భుతంగా నిర్వచించాడు.

**అనేక సంశయోచ్ఛేది పరోక్షార్థస్య దర్శనమ్।**
**సర్వస్య లోచనం శాస్త్రం యస్య నాస్త్యంధ ఏవ సః ॥**

శాస్త్రము మనకున్న అన్ని సందేహాలను తీరుస్తుంది. మనం చూడని విషయాల నెన్నింటినో స్పష్టంగా తెలుపుతుంది. ప్రపంచాన్ని చూపించే కన్నువంటిది. అటువంటి శాస్త్రజ్ఞానము లేనివాడే నిజమైన గుడ్డివాడని – శాస్త్రాన్ని అభివర్ణించాడు.

వేదార్థాలను, అందులో ప్రతిపాదించిన కర్మకాండలను తెలిసికోవడానికి ప్రత్యేకంగా శాస్త్రగ్రంథాలు పుట్టాయి. వీటిని వేదాంగాలు అనికూడా అంటారు. ఈ వేదాంగ సాహిత్యాన్ని ఋషులు సృష్టించారు. ఇవి ప్రధానంగా ఆరు.

**శిక్షాకల్పే వ్యాకరణం నిరుక్తం ఛందసా చయః ।**
**జ్యోతిషామయనం చైవ వేదాంగాని షడేవ తు ॥**

శిక్ష, కల్పము, వ్యాకరణము, నిరుక్తము, ఛందస్సు, జ్యోతిషము – అని ఇవి ఆరు. బ్రహ్మస్వరూపమైన వేదాలకు ఈ ఆరు వేదాంగాలు ఆరు శరీరాంగాల వంటివని ప్రసిద్ధ వ్యాకరణవేత్త పాణిని ఇలా పేర్కొన్నారు.

**ఛందః పాదౌ తు వేదస్య, హస్తౌ కల్పోంథ పఠ్యతే ।**
**జ్యోతిషామయనం చక్షుః, నిరుక్తం శ్రోత్రముచ్యతే ॥**
**శిక్షా ఘ్రాణంతు వేదస్య, ముఖం వ్యాకరణం స్మృతమ్ ।**

వేదభగవానునికి ఛందస్సు కాళ్ళు అని, కల్పసూత్రాలు చేతులని, జ్యోతిషం కండ్లు

అని, నిరుక్తం చెవులని, శిక్ష ముక్కు అని, వ్యాకరణం నోరు అనీ – పాణిని పండితుడు పేర్కొన్నాడు.

వేదాంగాలలో జ్యోతిషం మూడవది అయినా, నెమలికి శిఖ శిరస్సుమీద ఉన్నట్లు వేదాంగాల్లో ఇది శిరఃస్థానాన్ని వహిస్తుందని ప్రాజ్ఞులు చెబుతారు. రాజ్యం సుభిక్షంగా ఉండడానికి రాజులు యజ్ఞాలు, యాగాలు చేస్తారు. వాటిని ప్రారంభించడానికి, ముగించడానికి పెట్టే ముహూర్తాలను నిర్ణయించడానికి జ్యోతిషం అవసరమయింది. యజ్ఞయాగాదులు మంచి ఫలితాలను ఇవ్వాలంటే కేవలం విధివిధానాలే కాకుండా తగిన నక్షత్రం, సమయం కూడా అవసరమే. ఈ కాలనియమాన్ని పాటించడానికి కాలాన్నికూడా గణించడం అవసరమయింది. నక్షత్రాల సహాయంతో కాలనిర్ణయం చేయడం, గ్రహాల అనుకూల, ప్రతికూలనాలను నిర్ణయించడం జరుగుతుంది. రాను రాను ఋషులు నక్షత్ర, గ్రహాల గతులను, విధులను, భూ భ్రమణాలను మొదలైన వాటిని అధ్యయనం చేశారు. అందువలన జ్యోతిషం ఒక శాస్త్రీయ పద్ధతిలో వికసించింది.

గర్గమహర్షి, పరాశరుడు, జైమిని, భృగువు, వసిష్టుడు మొదలైన మహర్షులు జ్యోతిషం మీద అధ్యయనం గర్గసంహిత, పరాశర సంహిత, బృహత్పరాశరహోర, భృగు సూత్రాలు, వృద్ధ వాసిష్టము (జ్యోతిర్వాసిష్టము) మొదలైన ప్రామాణిక గ్రంథాలను వ్రాసారు. ఆ తర్వాత కాలంలో జ్యోతిషం – సంహిత, గణితం, జాతకం – అన్న విభాగాలుగా వికసించింది. ఆర్యభట్టు, వరాహమిహిరుడు, బ్రహ్మగుప్తుడు, భాస్కరాచార్యులు* మొదలైన వారు జ్యోతిషశాస్త్ర అభివృద్ధికి మేల్తరమైన కృషి చేసారు. కాళిదాసు పేరుతో జ్యోతిర్విధాభరణము, కాలామృతము అన్న గ్రంథాలు కూడా వెలిసాయి. వీరందరిలోను వరాహమిహిరుని బృహత్సంహిత ప్రామాణిక శాస్త్రగ్రంథంగా యావత్ప్రపంచముచేత అంగీకరించబడింది. 1946లో వి. సుబ్రహ్మణ్యశాస్త్రి, యమ్. ఆర్. భట్ పండితుడు దీనిని సంస్కరించి, నాగరలిపిలో ఇంగ్లీషు తాత్పర్యముతో ముద్రించారు. పీఠికలో ఈ గ్రంథము గురించి ఇలా తెలిపారు.

"If contains important astronomical data, geographical details,Architecture, sculpture, Medicine, Psychology, Physiology, Physiognomy, Botony, Zoology, prosody, figures of speech and other subjects. The author has made if extremely interesting inspite of its dealing with technical subjects" - Introduction page 4.

ఈ మహాగ్రంథమొక విజ్ఞానసర్వస్వము. అల్బెరూని అన్న ఖగోళశాస్త్రజ్ఞుడు ఆకాలంలోనే ఇందలి లఘుజాతకాన్ని పర్షియన్ భాషలోకి అనువదించాడు.

* కృష్ణమిశ్రుడు (ఇతడు ప్రబోధ చంద్రోదయ నాటక కర్త కారు.)

గ్రహాలు నక్షత్రాలు, భూభ్రమణము మొదలైన వాని ఆధారంగా ముహూర్తాలనే కాక వానల రాకపోకలను కూడ మన ప్రాచీన ఋషులు పరిశోధించారు. తమ పరిశోధనలను తమ తమ గ్రంథాలలో పొందుపరిచారు. బృహత్సంహిత అందలి మేలిమినంతా సమీకరించి గుణభూయిష్ఠమయింది. వ్యవసాయశాస్త్రము మీదకూడ సంస్కృతములో మంచి పుస్తకాలు వచ్చాయి. పరాశరమహర్షి వ్రాసిన **కృషిసంగ్రహః** అన్నగ్రంథము ప్రసిద్ధ వ్యవసాయ గ్రంథము. దీనికే కృషి పరాశర అన్న నామాంతరము కూడా ఉంది. ఈ పరాశరుడు చాలా ప్రాచీనుడు. ప్రముఖ పాశ్చాత్య పండితుడు బిల్ పోర్ట్ – పరాశరుని కాలము క్రీ.పూ. 1391 అని నిర్ణయించాడు. పుకనన్ అను ఇంకొక పండితుడు అతని ఉపపత్తులను ఖండించి పరాశరుడు క్రీ.పూ. 1300 నాటి వాడని నిర్ణయించాడు. ఈ గ్రంథంలో ఎడ్లు, వాటి లక్షణాలు, గోమయాన్ని ఎరువుగా మార్చడం, నాగలి సామగ్రి, ఏఱుకట్ట సామాను, దుక్కిదున్నే పద్ధతి, విత్తనాలు చల్లడం, ఎరువులు వేయడం, పైరుకోయడం, ధాన్యం నూర్చి తూర్పారబట్టి కైలు చేయడం, పాతరలలో గాదెలలో పురుగుపట్టకుండా ధాన్యం నిల్వచేయడం, పంటతెగుళ్ళు నివారణ మొదలైన విషయాలు వివరించబడ్డాయని తెలుస్తున్నది. నారదమహర్షి వ్రాసిన మేఘమాల గ్రంథము గ్రహగతులను అధ్యయనం చేసి వర్షాగమనాలను వివరించింది. అట్లే, పాదపవివక్ష, వృక్షదోహద, వృక్షాయుర్వేద – అన్నవి మరికొన్ని చెట్లకు సంబంధించిన శాస్త్రగ్రంథాలు.

ఈ మహాగ్రంథాలన్నీ సంస్కృతంలో ఉండడం వల్ల సామాన్యులకు ఈ శాస్త్రాలు అందని మ్రాని పండ్లయ్యాయి. క్రీ.శ. 11వ శాతాబ్దంలో నన్నయభట్టు విద్వత్సభలలో భారతానువాదానికి ఆమోదం పొందిన తర్వాత సామాన్యులకోసం మన తెలుగు కవులు శాస్త్రగ్రంథాలను కూడా అనువదించడం ప్రారంభించారు. కమ్మనాడులో పావులూరి గ్రామకరణం మల్లన తొలిసారి మహావీరాచార్యుని సారసంగ్రహగణితాన్ని తెలుగులోకి అనువదించాడు. పంచమవేదానువాద ప్రశస్తి రాజమహేంద్రవరానికి దక్కితే, తొలిశాస్త్ర గ్రంథానువాద ప్రసిద్ధి ప్రకాశంజిల్లాలోని పావులూరి గ్రామానికి దక్కింది.

## కవి పరిచయం

తిక్కనయుగం (1250–1320) లో **మూలఘటిక కేతన** యాజ్ఞవల్క్యస్మృతి – అన్న శాస్త్రగ్రంథాన్ని **విజ్ఞానేశ్వరీయం**గా అనువదించాడు. ఎఱ్ఱన యుగం (1320–1400)లో **దోనయామాత్యుడు** అన్నశాస్త్రకవి సంస్కృత జ్యోతిష శాస్త్రగ్రంథాలను అవలోడించి తొలిసారి **సస్యానందమ**న్న జ్యోతిషగ్రంథాన్ని వ్రాసాడు.

ఆ తర్వాత కాలంలో తిరుమల భట్టారకుడు (క్రీ.శ.1470–1530 ప్రాంతాలు, ఇతడు అప్పకవికి పెద్దతాత) కాలామృతము, అయ్యలభాస్కర జంటకవులు (క్రీ.శ.1550–1610 ప్రాంతాలు) రెట్టమత శాస్త్రము, కాకనూరి అప్పకవి (క్రీ.శ. 1610–1670 ప్రాంతాలు) కాలాబాలార్ణవము, చరిగొండ హొన్నయ (క్రీ.శ.1660–1720 ప్రాంతాలు) జ్యోతిష రత్నాకరము గ్రంథాలను రచించారు. వీటిలో అప్పకవి కాలాబాలార్ణవం అలభ్యము. అయ్యలభాస్కర కవుల రెట్టమతశాస్త్రము క్రీ.శ. 1300 ప్రాంతంలో రెట్టపండితుడు వ్రాసిన శాస్త్రగ్రంథానికి తెనిగింపు. ఇది మూడుసార్లు అచ్చయింది. మిగిలిన గ్రంథాలు మద్రాసు ప్రాచ్యలిఖిత భాండాగారంలో వ్రాతప్రతుల రూపంలో ఊపిరి పీలుస్తున్నాయి. వీటన్నిటిలోకి దోనయామాత్యుడు వ్రాసిన సస్యానందానికి పూర్వకాలంలో చాలా ప్రసిద్ధి ఉంది. ఇందలి పద్యాలు చాలామందికి కంఠస్థాలు.

సస్యానందంలో 4 అధికారాలు, 232 గద్యపద్యాలున్నాయి. ఇది 1891, 1915, 1921లలో ముచ్చటగా మూడుసార్లు అచ్చయింది. అయినప్పటికి దోనయ్యకవి కవుల చరిత్రలకుగాని, సాహిత్యచరిత్రలకుగాని ఎక్కలేదు. కీ.శే. నిడుదవోలు వేంకటరావుగారు భారతి పత్రిక (1946 జూన్) లో '**సస్యానందము – దోనయామాత్యుడు**' – అన్న వ్యాసము వ్రాసిన తర్వాత మొదటిసారి చాగంటి శేషయ్యగారి ఆంధ్రకవి తరంగిణిలో దోనయ్యకవికి కాస్తచోటు దొరికింది. సమగ్రాంధ్రసాహిత్యంలో ఆరుద్ర ఆయనకొక పీటవేసారు. ఆ తర్వాత సాహిత్యకారులు పెదాలతో ఆయనపేరును ఉచ్చరించారేగాని ఆయనను అధ్యయనం చేయలేదు. శాస్త్రకారులను సాహిత్యచరిత్రకారులు చాలా చిన్నచూపు చూసారు. అందులో సాముద్రికం వ్రాసిన అన్నయ్యకాని, పశువైద్యశాస్త్రం వ్రాసిన నారయ్యకాని, ఆయుర్వేదార్థ సంగ్రహం వ్రాసిన వేదయ్యకాని సాహిత్యచరిత్రలు ఉచ్చరించడానికి కూడ నోచుకోని దురదృష్టవంతులు.

ద్రోణ పదానికి వికృతి దోన. కనుక ద్రోణుడు అన్న శబ్దం నుండి దోనయ్య పుట్టి ఉంటుంది. దోనయ్య కవి నియోగి బ్రాహ్మణుడు. ఆపస్తంబసూత్రుడు. శ్రీవత్సగోత్రుడు. శివభక్తుడు. రుద్రమ్మ, మాచిరాజు అతని తల్లిదండ్రులు. కావ్యసాహిత్యాల కన్నా శాస్త్రపాండిత్యాన్ని ఆయన అమితంగా ప్రేమించాడు. అందువల్లనే శాస్త్రాలను కరతలామలకం చేసికొన్నాడు. ముఖ్యంగా జ్యోతిషశాస్త్రపారంగతుడయ్యాడు. నడిచే విజ్ఞానసర్వస్వ మయ్యాడు. తనవద్దకు వచ్చే పండితపామరులకు శాస్త్రసందేహాలు తీర్చేవాడు. ఈ సంవత్సరం వర్షాలు పడతాయా? ఈ సంవత్సరం ఏ పంటలు వేస్తే లాభిస్తుంది? – అంటూ తనవద్దకు వచ్చే

రైతులకు గ్రహగతులను లెక్కించి మరీ సలహాలిచ్చేవాడు. సమాజ ప్రయోజనం కోసం ఆయన **సస్యానందమనే వర్షశాస్త్రం** రచించాడు.

## దోనయ్య కవి కాలము

అప్పటికి ఆంధ్రసాహిత్యంలో శ్రీనాథుడు పుట్టలేదు. నాచనసోముడు, ఎఱ్ఱన సాహిత్యాకాశంలో సూర్యచంద్రులుగా ప్రకాశిస్తున్నారు. భాస్కరకవి బృందము, అమరేశ్వరుడు, త్రిపురాంతకుడు, వేములవాడ భీమకవి వంటి తారలు ఉజ్జ్వలంగా ప్రకాశిస్తున్నాయి. వీటన్నింటిలోను తిక్కన కాంతులు అంతర్లీనంగా ప్రసరిస్తున్నాయి. ఆ సమయంలో అంటే క్రీ.శ. 1356లో దోనయ్య కవి ప్రజలకోసం సస్యానందం వ్రాసాడు. సైరికానందం కల్గించాడు.

విశాఖపట్టణం జిల్లాలోని ఎలమంచిలి సర్వసిద్ధిని చాళుక్యరాజులు పరిపాలించారు. వారికి ఆశ్రితుడు దోనయ్య కవి. సస్యానందానికి ముందు సర్వలోకాశ్రయము అన్న గ్రంథము వ్రాసి చాళుక్యరాజు ఉపేంద్రునిచేత దోనయ్య ఘనంగా సన్మానింపబడ్డాడు. ఆ సంగతిని కవి ఇలా చెప్పుకొన్నాడు.

**ఆ.వె. వసుధలోనఁ బరమ వంశ విభూషణ - మైన నన్నుపేంద్రుఁడాదరింప**
**శ్రీకరముగ సర్వలోకాశ్రయముఁజెప్పి - మిన్నుముట్టఁ గీర్తిగన్నవాఁడ. 1-14**

సర్వలోకాశ్రయము ఇవాళ దొరకదు కాని సర్వలోకాశ్రయుడన్న బిరుదును ధరించిన ఉపేంద్ర చక్రవర్తి గురించి కొంత తెలుస్తున్నది. అతడు తూర్పు చాళుక్య శాఖలోనివాడు. తూర్పు చాళుక్య రాజులలో మహాభారతాన్ని కృతిపొందిన రాజరాజనరేంద్రుడు సుప్రసిద్ధుడు. అతని తర్వాత ఒక శాఖవారు కళింగదేశంలో ఎలమంచిలి సర్వసిద్ధి మండలంలో రాజ్యపాలన చేసారు. వాళ్ల శాసనాలు పంచదార్ల అన్న గ్రామంలోని శ్రీధర్మలింగేశ్వర ఆలయంలోను, సింహాచలంలోను ఉన్నాయి. విన్నకోట పెద్దన తనకావ్యాలంకారచూడామణి అన్న అలంకారశాస్త్రగ్రంథాన్ని ఈ వంశంలోని వాడైన విశ్వేశ్వరరాజుకే అంకితమిచ్చాడు. దోనయ్యను గౌరవించిన ఉపేంద్రుడు ఈ విశ్వేశ్వరునకు తాత. ఈ వంశరాజులకు సర్వలోకాశ్రయ బిరుదము వంశపారంపర్యంగా వస్తూ ఉన్నది. ఈ శాఖలో నలుగురు ఉపేంద్రులు ఉన్నారు. నిడుదవోలు వేంకటరావుగారు శాసనాలను పరిశీలించి ఆశాఖవారి వంశవృక్షాన్ని భారతిలో ఇచ్చారు. ఆయనకు కృతజ్ఞతలు చెప్పుకొంటూ ఆ వంశవృక్షాన్ని ఇస్తున్నాను.

విమలాదిత్యుడు
|
రాజరాజనరేంద్రుడు
|
కుళోత్తుంగుడు
|
విజయాదిత్యుడు
|
మల్లపదేవుడు i (లక్ష్మీదేవి)
|
ఉపేంద్రుడు i (గంగాంబ)
|
మల్లపదేవుడు ii (చోడాంబ)
|
(క్రీ.శ. 1283) ఉపేంద్రుడు ii (మల్లాంబ)
|
కొప్పరాజు (గంగాంబ)
|
ఉపేంద్రుడు iii (భీమాంబ) సస్యానందమున చెప్పబడిన రాజు
|
చెన్నేశ — ఉపేంద్రుడు ii (మనుమోపేంద్రుడు - లక్కాంబిక)
|
విశ్వేశ్వరరాజు (కావ్యాలంకారచూడామణి కృతిభర్త)

ఈ వంశవృక్షంలో నలుగురు ఉపేంద్రులున్నారు. వీరిలో మూడవ ఉపేంద్రుడే సస్యానందంలో ప్రస్తావింపబడిన ఉపేంద్రుడని నిడుదవోలు వేంకటరావుగారు నిర్ణయించారు. చాగంటి శేషయ్యగారు ఆమోదించారు. మూడవ ఉపేంద్రుడు క్రీ.శ. 1350,1356 ప్రాంతాలలో ఉన్నట్లుగా చరిత్రశోధకులు నిర్ణయించారు. సర్వలోకాశ్రయ బిరుదము[1] లభించినట్లైతే ఇది తొలి చారిత్రక కావ్యమై ఉండేది.

1. చాళుక్యరాజులది కనుక సర్వాలోకాశ్రయ గ్రంథములో ఈ చాళుక్య రాజుల చరిత్ర, రాజరాజనరేంద్రుడు మొదలైన వారు వర్ణితులై ఉండవచ్చు.

సస్యానంద కావ్య వ్రాతప్రతులలో గ్రంథరచనా కాలమును తెలుపు పద్యం ఒకటి ఉంది. ఇది ముద్రిత ప్రతులలో లేదు. మద్రాసు ప్రాచ్యలిఖితభాండాగారములోని వ్రాతప్రతులలో ఉన్న ఆ పద్యాన్ని నిడుదవోలు వారు సంపాదించారు. అది వ్రాత ప్రతులలో రెండు రకాలుగా ఉంది. గ్రంథ సంఖ్య 2385 గల ప్రతిలో ఇలా ఉంది.

**క. కరినగ దినకర శక వ**
**త్సరములు భువి బరగుచుండ సస్యానందం**
**బిరవుగ శ్రీగిరినాథున**
**కరుదుగ రచియించె దోనయామత్యుడిలన్.**

దీని ప్రకారం శక సంవత్సరాలు కరి - 8, నగ - 7, దినకర - 12. కనుక శాలివాహన శకం 1278, క్రీ.శ.(1278+78) 1356 అవుతుంది. గ్రంథ సంఖ్య 2340 ప్రతిలో ఈ పద్యమిలా ఉంది.

**క. కర వసుధి శక శక వ**
**త్సరములు దివి బెరుగుచుండ సస్యానందం**
**బరయగ శ్రీగిరి నాథున**
**కరుదుగ రచియించె దోనయామాత్యుడిలన్.**

ఇందలి మొదటి పాదంలో వ్రాతదోషాలున్నాయి. నిడుదవోలు వారు దీనిని కర వసుదినకర అని దిద్దగా కర - 2, వసు - 8, దినకర - 12. శాలివాహన శకం 1282, క్రీ.శ. (1282,+78) 1360 అయింది. ఈ రెండూ మూడవ ఉపేంద్రుని కాలానికే సరిపడుతున్నాయి. ప్రాత వ్రాతప్రతులలోను, నిడుదవోలు వారి సొంత గ్రంథాలయంలోని తాళపత్ర ప్రతిలోను శా.శ. 1278 క్రీ.శ. 1356 అని తెలుపు మొదటి పద్యం ఉండుట చేత, గ్రంథరచనా కాలం క్రీ.శ. 1356 అని నిశ్చయింపవచ్చును. అప్పుడు దోనయ్య కవి జీవితకాలము స్థూలంగా క్రీ.శ. 1300-1360 ప్రాంతం అవుతుంది.

దోనయ్య కవి శివభక్తుడు. తన కావ్యాన్ని శ్రీశైలమల్లికార్జునుడిని సంబోధిస్తూ చెప్పాడు. అవతారికలోని 2వ పద్యంలో సింహాచల ప్రస్తావన ఉంది.

**చ. దురితమహోల్క పెంపుడిపి దుఃఖదవానలమార్చి చక్ర వి**
**స్ఫురణతటిల్లతామహిమ సొంపువహింపననారతంబు నా**
**దరమున సింహశైలమున తద్దయు వేడ్క చరింపుచున్న సుం**
**దరజలదంబు ధాత్రికి సుధాంతకృపామృతవృష్టి జేయుతన్ ॥ 1-2**

పాపాలు అనే పెద్దపెద్ద కొరువులను అణచి, దుఃఖమనే కార్చిచ్చును చల్లార్చి, చక్రపు కాంతులు అనే మెరుపులు మెరుస్తూ ఉంటే నిత్యం ప్రేమతో సింహాచలంలో పూజలందుకొంటున్న సుందరేశ్వరుడు అనే మేఘము ఈ భూమికి తన కృపామృతాన్ని వర్షించుగాత – అని దీని తాత్పర్యము. తాను వ్రాస్తున్నది వానల శాస్త్రం కనుక స్వామిని మబ్బుతో పోల్చడము ఔచితీశోభితంగా ఉంది. సింహాచలస్వామిని స్తుతించడమువలన దోనయ్యకవి ఈప్రాంతం వాడే కావచ్చును. కావ్యంలో కడపజిల్లాలోని సిద్ధవటములో కొలువున్న శివసంబోధన నాల్గుచోట్ల (1–34, 46; 4–24,26) ఉంది. సిద్ధవటము శ్రీశైలక్షేత్రానికి దక్షిణముఖద్వారము. గ్రంథరచనా కాలమునాడు కవి ఈ క్షేత్రాన్ని కూడా దర్శించి ఉండవచ్చును.

ప్రాచ్యలిఖితభాండాగారంలోని మూడు తాళపత్రప్రతులలో ఈ గ్రంథం అద్దంకి లింగకవి వ్రాసినట్లు ఆశ్వాసాంత గద్యలలో "ఇది సకల జనస్తుత్య ద్రోణయామాత్య పుత్ర సజ్జన విధేయ అద్దంకి లింగకవి నామధేయ ప్రణీతంబైన సస్యానందంబున ప్రథమాధికారము" అని ఉంది. ఇంకొక తాళపత్ర ప్రతిలో కావ్యాంతంలో అద్దంకి లింగకవి కృతముగా ఈ క్రింది పద్యమున్నది.

**క. ఈ సస్యానందమునకు, భాసురముగ కాలగతులు పరమార్థముగా**
**నీ సవి నెఱుఁగుఁడని కృతిని, వాసన నద్దంకి లింగ వర్యుఁడు చెప్పెన్.**

ఈ పద్యం నిడుదవోలు వారి గ్రంథసంచయంలోని వ్రాతప్రతిలో లేదు. ఈ లింగకవి వ్రాయసగాడు, కవి అని చాగంటి శేషయ్యగారు, నిడుదవోలువారు భావించారు. అతడు కొన్ని ప్రక్షిప్తాలను చేర్చాడని ఆరుద్రగారు ఊహించారు.

కాని, ఈ కృతి వాలకం చూస్తే ఇది ఎవరికీ అంకితమైనట్లు కనబడదు. సాధారణంగా కావ్యారంభం వృత్తంతో ప్రారంభమవుతుంది. కవి తన ఇష్టదైవముతో కృతి భర్తకు ఆశీస్సులిప్పించడం, లేదా తన ఇష్టదైవానికి అంకితమిస్తే తమను ఆశీర్వదించమనో తొలిపద్యంలో ఉంటుంది. కాని ఈ గ్రంథము కృత్యాది కందపద్యముతో ప్రారంబమయింది. ఈ యుగకావ్యాలైన భాస్కరరామాయణ, ఉత్తర హరివంశకావ్యాలు కూడ కందపద్యంతోనే ప్రారంభమయ్యాయి. అయితే ఈ కావ్యాలకు అవతారికలు లేవు. భాస్కర రామాయణాన్ని నలుగురు కవులు వ్రాసారు. ఆనాటి కల్లోల రాజకీయాల కారణంగా అది ఎవరికీ అంకితం కాలేదు. అందువలన కావ్యం కందపద్యంతోనే ప్రారంభమయింది. ఉత్తర హరివంశ అవతారిక పూర్వహరివంశంలో ఉంటుంది. అది అలభ్యం కనుక, ద్వితీయ భాగం కంద గద్యంతో ప్రారంభమయింది. కావ్యాన్ని అంకితమిచ్చే సంప్రదాయం సంస్కృత సాహిత్యంలో

లేదు. ప్రాకృతం లోనే ఉంది. ప్రాకృతం నుండి కన్నడ, తెలుగు భాషలకు ఈ సంప్రదాయం సంక్రమించింది.

సస్యానందానికి అవతారిక ఉంది. అయినా కందపద్యంతోనే ప్రారంభమయింది. అవతారిక పూర్తిఅయ్యాక అంకితచిహ్నాలైన షష్ఠ్యంతాలు, ఆ తర్వాత – '**అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా రచియింపం బూనిన**' అన్న వాక్యంతో కావ్యాలు ప్రారంభమవుతాయి. వీటికి ఆద్యుడు మూలఘటిక కేతన అని విమర్శకులు చెబుతారు. ఇవేవీ సస్యానందంలో **కన్పించవు**. సాధారణంగా ఆశ్వాసారంభ, ఆశ్వాసాంతపద్యాలు కృతిపతిని ఉద్దేశించి ఉంటాయి అవికూడ ఈ గ్రంథంలో కన్పించవు. ఆశ్వాసారంభ పద్యము కందంతో మొదలవుతుంది. ఇందులో ఆశ్వాసాది ఉత్పలమాలతోను, మత్తకోకిలతోను నేరుగా ఇతివృత్తంతో ప్రారంభమవుతున్నాయి. అందువలన ఈగ్రంథం ఎవరికీ అంకితం కాలేదు.

కవి ఈ గ్రంథాన్ని వృద్ధాప్యంలో సంకల్పించుకొని ఉంటాడు. నాలుగు అధికారాలు వ్రాసాక, జరాభారంతో వ్రాయలేక గ్రంథరచనాకాలము తెలిపే కందపద్యంతో ముగించి, మరణించి ఉంటాడు. అందువల్లనే కావ్యాంతంలో ఉండవలసిన ఫలశ్రుతి కూడా ఇందులో లేదు. అసమగ్రమైన ఈగ్రంథము అద్దంకి లింగకవికి లభించి ఉంటుంది. తనపేరుగల ఆశ్వాసాంతగద్యతో ప్రతులు పుట్టించి ఉంటాడు. తన గ్రంథచౌర్యము బయటపడకుండా దోనయామాత్య పుత్రుడనని ఆశ్వాసాంత గద్యలలో చెప్పుకొని ఉంటాడు. అప్పటికే దోనయ అవతారికతో దేశంలో ప్రతులు పుట్టాయి. లింగకవి పుట్టించిన ప్రతులు కూడా జనాలలోకి వెళ్లాయి. అందువల్లనే రెండురకాల కర్తృత్వాలు వ్రాత ప్రతులలో కన్పిస్తున్నాయి.

దోనయ్య కొడుకునని అద్దంకి లింగకవి ఆశ్వాసాంత గద్యలో వ్రాసికొన్నాడు. దోనయ్య శ్రీవత్స గోత్రుడు. అద్దంకి వాళ్లలో కౌండిన్య, కాశ్యప గోత్రాలే కాని శ్రీవత్సగోత్రం కనిపించదు. అందువలన లింగకవి దోనయ్య పుత్రుడు కాడనే చెప్పవలసి ఉంది. సాహిత్యంలో ఇటువంటి అళీకాలు కొన్ని ఉన్నాయి. హరిభట్టు కవి (1490–1550 ప్రాంతాలు) ఉత్తర నారసింహపురాణం నృసింహాంకితంచేసి గతించాడు. అతని కొడుకు రాఘవ మనీషి ఆ అంకితపద్యాలు తొలగించి, కొత్తగా అంకిత పద్యాలు వ్రాసి, ప్రోలుగంటి రంగయ్యకు అంకితమిచ్చాడు. తెనాలి రామకృష్ణుని ఘటికాచలమాహాత్మ్యంమీద కూడ ఇటువంటి అనుమానాలే ఉన్నాయి. రామకృష్ణుడు గ్రంథం వ్రాసి, గతించాక, అతని మనుమడు ఆ కావ్యాన్ని ఖండోజీ ప్రభువుకు ఇచ్చాడు. అతని ఆస్థానకవి వేంకటగిరి ఖండోజి ప్రభువు కంకితంగా వంశావళి, ఆశ్వాసారంభ, అంత్యపద్యాలను వ్రాశాడు. సాహిత్యంలో ఇలాంటివి బోలెడు.

కాలం చాలా విచిత్రమైనది. సస్యానంద కర్తృత్వం ఒక చిక్కుముడి అయితే, అచ్చువేసిన ముద్రాపకులు ఏకంగా ఆయన పేరునే మార్చి ముద్రించి ఇంకో పీటముడివేసారు. దోనయామాత్యుడిని గోనయామాత్యుడిని చేసారు. 1891లో పువ్వాడ సూర్యనారాయణరావు అండ్ బ్రదర్స్‌వారు చెన్నపురిలో తమ వర్తమాన తరంగిణీ ముద్రాక్షర శాలలో ఖరసంవత్సర జ్యేష్ఠమాసంలో (జులై 10, 1891) దీనిని మొదటిసారి ముద్రించారు. ప్రముఖ గణిత శాస్త్రవేత్త, రచయిత అయిన తడకమళ్ళ వేంకటకృష్ణారావు దీనిని పరిష్కరించారు. ఈ ముద్రణే యథాతథంగా 1915, 1921లలో వివిధ సంస్థలచే ముద్రింపబడింది. నావద్ద గల ప్రతి 1921 నాటిది. ఈ ముద్రణలలో (నిడుదవోలు వారి వ్యాసము ననుసరించి) కవి తన గుఱించి చెప్పుకొన్న పద్యం ఇలా ఉంది.

**ఉ. ధీనిధి మాచిరాజునకు ధీరగుణాన్విత రుద్రమాంబకున్**
**సూనుఁడ ధర్మతత్పరుఁడ సోమకళాధర పాదపంకజ**
**ధ్యాన పరాయణుండ నయతత్త్వవివేక విచార దక్షుఁడన్**
**గోనయ నామధేయుఁడ వికుంఠ చరిత్ర రసైక లోలుఁడన్. 1-12**

దోనయ్య గోనయ్య అయ్యాడు. పూర్తిగా కవియే మారిపోయాడు. నిడుదవోలు వారివద్దనున్న వ్రాతప్రతిలోను, ఆయన శోధించిన మద్రాసు వ్రాతప్రతులలోను నాల్గవ పాదం '**గోనయనామధేయుఁడ వికుంఠ చరిత్ర రసైక లోలుఁడన్**' కు బదులుగా–

'**దోనయ నామధేయుఁడ విధూత కళంక పవిత్ర చిత్తుఁడన్**' – అన్న పాఠమే ఉన్నది. దీనిని గురించి కొంత ఊహించి ఆయన ఇంకా ఇలా వ్రాసారు.

'వ్రాత ప్రతులలో నన్నింటను '**దోనయ**' యనియే కాని గోనయ యని నాకు కానరాలేదు. కృష్ణరావు గారి ముద్రిత ప్రతికి మూలమున మొదట 'దో' యనునది స్పష్టముగా తెలియక పోయి యుండవచ్చును. అది 'గో' గా వారు గ్రహించి, అది యతి స్థానమందుండుటచే, వారు స్వయముగా కవులగుటచే 'వికుంఠ చరిత్ర' అని దానిని పూర్తిచేసి యుందురు. ఉపలబ్దములైన వానిలో 'దోనయ' యని యుండుట వలన నీగ్రంథకర్త 'దోనయ'యని నిర్ధారింపదగును' అని వ్రాసారు. ఆశ్వాసాంత గద్యలలో ఎలా ఉందో ఆయన ఊహించలేదు.

నిడుదవోలు వారిని చాగంటి శేషయ్య సమర్ధించారు. ఆయన దోనయ మీద భారతిలో వ్యాసం వ్రాయక పోయినట్లైతే దోనయ్య గోనయ్యగానే మిగిలిపోయేవాడు. అందుకా పరిశోధనా పరమేశ్వరుల నెంతైనా అభినందించవలసి ఉంది.

అనాదిగా భారతీయుల ప్రధానవృత్తి వ్యవసాయం. వ్యవసాయం వర్షంపై ఆధారపడి ఉంటుంది. వానలు పడితే పంటలు బాగా పండుతాయి. పంటలు బాగా పండితే ప్రజలు

సుఖసంతోషాలతో ఉంటారు. అందువలన అందరికీ వానలు కావాలి. ఆ వానల రాకపోకలు తెలిసికోవడం అందరికీ అవసరం. అది గౌరవప్రదమని దోనయ్య అభిప్రాయం.

రాక్షసులు, దేవతలు, యక్షులు మొదలైన వారెవరూ స్త్రీల మనస్సును, వానల రాకపోకలను ఊహించలేరని సామెత. అందువలన గార్గ్యసంహిత, మిహిరసంహిత, లల్ల సంహితల సారాన్ని గ్రహించి, వానల గుఱించి ప్రజలు తెలిసికోవడం కోసం సస్యానంద గ్రంథరచనకు (సస్యానందం 1-7,8) దోనయ్య సంకల్పించాడు. ఆంధ్రావళి మోదముం బొరయుటకై తిక్కన సోమయాజి భారతాన్ని తెనిగించాడు. ప్రజలలో వర్షవిజ్ఞానాన్ని కల్గించడానికి దోనయ్యకవి సస్యానందం వ్రాసాడు. అతని సంకల్పం వెనుక ఒక ఉదాత్తమైన సామాజిక స్పృహ ఉంది.

దోనయ కాలం నాటికి గర్గసంహిత, హరిభట్టు మతము (ఇతడు మత్స్య, వరాహ, ఉత్తర నారసింహపురాణాలు వ్రాసిన హరిభట్టు (1490-1550 ప్రాంతాలు) కాదు. ధన్వని మతము, శ్రీపతి మతము, మిహిర సంహిత, మేఘమాలిక (నారదమహర్షి కృతము), నారాయణభట్టు మతము మొదలైన జ్యోతిష గ్రంథాలు దక్షిణభారతంలో ప్రచారంలో ఉండేవి. వీటిని ఆధారంగా చేసికొని రెట్టపండితుడు క్రీ.శ. 1300 ప్రాంతంలో కన్నడంలో రెట్టమతశాస్త్రం వ్రాసాడు. ఈ గ్రంథాలలో ఉన్న కొన్ని మూఢనమ్మకాలు – అంటే వానలు మబ్బుల వల్ల కాకుండా, ప్రశ్న అడిగేవాళ్లు పట్టుకొన్న వస్తువులను, ప్రక్కనున్న శకునాలను బట్టి కురుస్తాయో, లేదో చెప్పవచ్చున్న మూఢనమ్మకాలు యథాతథంగా రెట్టమతశాస్త్రంలోకి ఎక్కాయి. ఉదా॥ కు ప్రశ్న అడిగేటప్పుడు ఎవరైనా వల, నిప్పులు మొదలైనవి పట్టుకొంటే వానలు పడవని రెట్టమతశాస్త్రం (2-18) చెబుతుంది. ఇటువంటి మూఢనమ్మకాలను విడచి దోనయ్య గర్గ, మిహిర, లల్లసంహితల ఆధారంగా శాస్త్రీయంగా సస్యానందం వ్రాసాడు. లల్లసంహితను రెట్టపండితుడు ఎఱుగడు.

క్రీ.శ. 13వ శతాబ్దానికి చెందిన లల్లపండితుడు లల్లసంహితను వ్రాసాడు. నైషధకర్త వ్రాసిన ఖండనఖండఖాద్యానికి కూడా ఈ కవి వ్యాఖ్య వ్రాసాడు. లల్లసంహిత అసలుపేరు శిష్యధీవృద్ధి తంత్రమని దానికే శిష్యతంత్రము, మహాతంత్రమని పేర్లున్నాయని ప్రముఖ పండితులు శ్రీ ఇప్పగుంట సాయిబాబాగారు నాకు తెలిపారు.

## గ్రంథపరిచయము

సస్యానందంలో 4 అధికారాలున్నాయి. మేఘనిర్ణయము, ధాతు ప్రకారము, గర్భకాలము, ద్రోణ ప్రకారము, ద్రోణ ప్రమాణము, చంద్రయోగము, ఫలపక్షియోగము, ఆషాఢ లక్షణము, వాయు ప్రకారము, శ్రావణ మాస గర్భము, గ్రహణోత్పాతము,

మేఘలక్షణము, పరివేష లక్షణము, శుక్రోదయాస్త లక్షణము, గ్రహచార లక్షణము, బుధోదయ లక్షణము, గ్రహయుద్ధము, గ్రహాధికార దేశములు, వర్ష ప్రశ్నోత్తరము, గురుసంచారము ఇందులో వివరింపబడ్డాయి.

గురుసంచారము ఈ గ్రంథానికే తలమానికమైనది. గ్రహాలలోకెల్లా శుభగ్రహం గురువు. జాతకాలలో కూడా గురుడు శుభకరుడు. అతని ఫలాలు కూడా సుఖప్రదమైనవి. గురుని బృహస్పతి అని కూడా వ్యవహరిస్తారు. సూర్య కుటుంబంలోని గ్రహాలన్నిటికన్నా గురువు ఘనపరిమాణమే హెచ్చని ప్రాచీన ఋషులు చెప్పిన సత్యాన్ని నిజమని ఆధునిక ఖగోళశాస్త్ర పరిశోధనలు ఋజువు చేసాయి. గ్రహాలన్నీ సూర్యుని చుట్టూ తమతమ కక్ష్యలలో నిరంతరం పరిభ్రమిస్తూ ఉంటాయి. బృహస్పతి కక్ష్య కుజకక్ష్యకు వెలుపల, శని కక్ష్యకు లోపల ఉంటుంది. అంటే అంతరంగంలో కుజవ్యాప్తి, బహిరంగంలో శని వ్యాప్తి ఉండటం వలన ఈ రెండు గ్రహాల ధర్మాలు బృహస్పతిలో కన్పిస్తాయి. కుజుడు అగ్నిగోళం – ఉద్రేక కారి. సాహసప్రియుడు, నిరంకుశాధికారం, తోటిపురోగమనం, అభివృద్ధిని కాంక్షించుట ఈగ్రహధర్మం. శని శీతల గోళం. నిసర్గ భీరువు. జడత్వ స్వభావం కలది. ఎటువంటి వికాసమూ ఉండదు. ఈ రెండు గ్రహాల మధ్య ఉన్న బృహస్పతి అటు కుజునికి, ఇటు శనికి లోబడక ఇద్దరి సహజగుణాలను లోక కల్యాణం కోసం సమ్మేళనం చేసికొన్నాడు. రాశిచక్రంలో, గ్రహాల ఆధిపత్యంలో కూడా ఈ పద్ధతే కన్పిస్తుంది. గురుక్షేత్రాలైన ధనుస్సు, మీనాలు రెండింటిని ఒకవైపున కుజరాశి, ఇంకొక వైపున శనిరాశి అంటి ఉన్న విషయాన్ని గమనిస్తే – బృహస్పతిలో ఉన్న కుజ శని ధర్మసమ్మేళనం బోధపడుతుంది. కాలహోరా – నిర్ణయ విషయంలో శని కుజ హోరల మధ్య గురుహోరను విధించిన హోరాశాస్త్రవేత్తలు ఈ ఖగోళ శాస్త్ర మర్యాదను గౌరవించారని నమ్మవలసి ఉంది.

గురుడు కొన్ని నెలలు సంధ్యవేళ, కొన్ని నెలలు అర్ధరాత్రివేళ, కొన్ని నెలలు అర్ధరాత్రి వేళ పొడుస్తాడు. గురుసంచారం జ్యోతిషశాస్త్ర గ్రంథాలలో ఒకపెద్ద అధ్యాయం. గురుడు ఒక్కొక్కరాశిలో ప్రవేశించినపుడు ఒక్కొక్క ఫలితం ఉంటుంది. గురుడు మేషరాశిలో ప్రవేశిస్తే, ఆ సంవత్సరం వర్షాలు బాగా కురుస్తాయి. నవధాన్యాలు పండుతాయి. వర్షాలకారణంగా వ్యాధికారక సూక్ష్మజీవులు ప్రబలి మేకలు, గొఱ్ఱెలు చనిపోతాయి. పాడిపంటలు సమృద్ధిగా ఉంటాయి. బ్రాహ్మణులు యజ్ఞాలు చేస్తారు. గురుడు వృషభరాశిలోకి ప్రవేశిస్తే ఆ సంవత్సరం వర్షాలు పడవు. కరువు వస్తుంది. శిశువులు, పశువులు నశిస్తాయని దోనయ్యకవి వివరంగా (సస్యానందం 4–43,44) ఒక్కొక్క రాశిలో గురు ప్రభావాన్ని విశదీకరించాడు. గురుసంచారంలో దోనయ్య కవి కొన్నిచోట్ల రెట్టపండితునితో విభేదించాడు.

గురువు మిథునంలో ఉన్నప్పుడు ఆ సంవత్సరం పశువులకు భీతి కలుగుతుంది.

ప్రజలకు శుభాలు కలుగుతాయి. వర్షాలు బాగా పడతాయి. స్త్రీలకు సంతానం కలుగుతుందని దోనయ్య (సస్యానందం (4-45) చెప్పాడు. కాని రెట్టపండితుడు గురుడు మిథునంలో ఉన్నప్పుడు రాజులు శత్రువుల చేతిలో కూలిపోతారని ఇలా చెప్పాడు.

**క. సురగురుఁడు మిథునరాశిని, జరియించిన ధరణిపతులు శత్రులచేతన్**
**దురమున గూలుదు రనియెను, సరసులు మెచ్చంగ రెట్ట సత్కవి వేడ్కన్(5-4)**

అట్లే గురుడు కర్కాటకంలో ఉన్నప్పుడు ఆ సంవత్సరం ప్రజలు తిండిలేక ఊళ్లను పట్టి పోతారని (సస్యానందం 4-46) దోనయ్య చెప్పాడు. కాని రెట్టపండితుడు గురుడు కర్కాటకంలో ఉన్నప్పుడు వానలు ఒకమోస్తరుగా కురుస్తాయని, వరి, చెఱకు బాగా పండుతాయని, పశువులు బాగా పాలిస్తాయని, ప్రజలకు కొన్ని ఇబ్బందులుంటాయని ఇలా చెప్పాడు.

**గీ. గురుఁడు కర్కటముంజేర కొద్దివాన, చెఱకు వరియును ఫలియించు సిద్ధముగను**
**గోవులెల్లను బిదుకును ప్రజలునొత్తు, రనియె రెట్టఁడు సకల విద్యావిదుండు (5-5)**

ఒక్కొక్క ప్రాంతానికి అధిపతిగా ఉన్న గ్రహాలను, ఒక్కొక్క పండితుడు ఒక్కొక్కవిధంగా చెప్పడమే ఇందుకు కారణమని అన్పిస్తుంది. ఒక్కొక్క ప్రాంతానికి ఒక్కొక్క గ్రహం అధిపతిగా ఉంటుంది. ఏ ఏ ప్రాంతాలకు ఏ ఏ గ్రహాలు అధిపతులో దోనయ్య కవి ఇలా (4-31,32,33) వివరించాడు.

| | ప్రదేశము | | అధిపతి |
|---|---|---|---|
| 1. | హిమాలయమునుండి గంగానదివఱకు | - | శని |
| 2. | గంగానదినుండి వింధ్యపర్వతంవఱకు | - | బుధుడు |
| 3. | వింధ్యనుండి గోదావరివఱకు | - | గురుడు |
| 4. | గోదావరినుండి కృష్ణానదివఱకు | - | శుక్రుడు |
| 5. | కృష్ణానదినుండి లంకవఱకు | - | అంగారకుడు |
| 6. | మూడు లోకాలకు | - | చంద్రుడు. |

ఇది బృహత్సంహితను అనుసరించినది. కాని రెట్టపండితుడు - హిమాలయాలనుండి గంగానదివఱకు బుధుడు, వింధ్యనుండి గోదావరి వఱకు శుక్రుడు, గోదావరి నుండి లంక వఱకు అంగారకుడు అధిపతులని చెప్పాడు. ఏ మతాన్ని అనుసరించి రెట్టపండితుడు ఈ క్షేత్ర విభజన చేసాడో కాని ఇందువలన గ్రహయుద్ధ ఫలాలు విభేదిస్తున్నాయి.

గ్రహాల మధ్య యుద్ధం వచ్చినప్పుడు ఏ గ్రహం ఓడిపోతుందో ఆ గ్రహక్షేత్రంలో ఉండే దేశానికి యుద్ధం సంభవిస్తుంది. అరిష్టాలు కలుగుతాయి. రెట్టపండితుడు చెప్పని ఈ అపూర్వ విషయాన్ని దోనయ్యకవి వివరించాడు. నిండు చంద్రునితో ముందుగా అంగారకుడు కలిసిపోతే ఘోరమైన యుద్ధాలు జరుగుతాయి. నేలంతా రక్తంతో తడిసిపోతుంది. బుధుడు ముందుగా కలిసిపోతే వానలు పడవు. నిండు చంద్రునితో ముందుగా గురువు కూడితే ఏనుగులు గుంపులు గుంపులుగా నశిస్తాయి. శుక్రుడు ముందుగా చంద్రునితో కూడిపోతే రకరకాల జబ్బులతో దేశమంతా నాశనమై పోతుంది. శని ముందుగా చంద్రుని కూడిపోతే రాజుల గర్వం నశిస్తుంది. వర్షం కురిస్తే మాత్రం రాజుల గర్వానికి భంగం రాదని దోనయ్యకవి (సస్యానందం 4-24) వివరించాడు.

**గీ. అనఘ! యమరవైరి నంగారకుఁడు బుధు । ఁజంద్రుతోడఁబోరి జయము నొంద ।**
**నవనిఁబోరుపుట్టునసు రేజ్యుఁడవనిజు । నొడిచెనేని వాన లుర్విఁగురియు ॥4-29**

అంగారకుడు శుక్రునితో యుద్ధంచేసి ఓడించినా, బుధుడు చంద్రునితో యుద్ధంచేసి ఓడించినా భూమిమీద ఘోరమైన యుద్ధాలు జరుగుతాయి. శుక్రుడు అంగారకుని ఓడిస్తే మంచి వర్షాలు కురిసి పంటలు బాగా పండుతాయి.

శుక్రుడు చంద్రుని ఓడించినా, ఆ శుక్రుడు గురువును ఓడించినా భూమిమీద వానలుండవు. బుధ, శుక్రులు కలిసి ఒకరాశిలో ఉంటే వానలు బాగా కురుస్తాయి. బుధ, శుక్రులిద్దరిలో ఒకరు వక్రించి ఐదవ ఇంటగాని, తొమ్మిదవ ఇంటగాని ఉంటే వానలు బాగా కురుస్తాయి. (సస్యానందం 4-26,27)

అంగారకుడు శుక్రునితో యుద్ధంచేసి ఓడించినా, బుధుడు చంద్రునితో యుద్ధంచేసి ఓడించినా భూమిమీద ఘోరయుద్ధాలు జరుగుతాయి. శుక్రుడు అంగారకుని ఓడిస్తే సమృద్ధిగా వర్షాలు కురిసి పంటలు బాగా పండుతాయి. నాలుగు గ్రహాలుగాని, ఐదుగ్రహాలుగాని ఒకేరాశిలో ఉంటే ఘోరయుద్ధాలు జరుగుతాయి. అందువలన గ్రహశాంతి చేయడం మంచిదని దోనయ్య కవి (సస్యానందం 4-29,30) అపురూప విషయాలను గ్రంథస్థం చేసాడు.

## దోనయ్య చెప్పని విషయాలు

గురుడు ఒక్కొక్క నక్షత్రంలో ఉదయించినపుడు ఒక్కొక్క అబ్దమని చెప్పబడుతుంది. ఒక్కొక్క ఫలితం వస్తుంది. ఉదా॥కు గురుడు కృత్తికా నక్షత్రంలోను రోహిణీ నక్షత్రంలోను ఉదయిస్తే దానిని కార్తికాబ్దమని అంటారు. అందులో - ఆయుధాల వలన భయం

కలుగుతుంది. ప్రజలకు ఈతిబాధలు కలుగుతాయి. రాజులకు ఆపదలు సంభవిస్తాయి. రోగాలు ప్రబలుతాయి. అట్లే గురుడు పునర్వసు, పుష్య, ఆశ్లేష నక్షత్రాలలో ఉదయిస్తే దానిని పౌషాబ్దమని అంటారు. అందులో ప్రజలు ప్రేమాభిమానాలతో ఉంటారు. వర్షాలు బాగా కురుస్తాయి. ప్రజలు సుఖంగా ఉంటారు. ఈ విధంగా గురుడు ఒక్కొక్క నక్షత్రంలో ఉదయించినప్పుడు దానిపేరు, ఫలితాలను దోనయ్య వివరించలేదు.

సంవత్సర ఫలాలను, నూతన వస్త్రధారణ ఫలాలను కూడ దోనయ్య వివరించలేదు. ఉదా॥ కు ప్రభవ నామ సంవత్సర ఫలం – పంటలు తగుమాత్రంగా పండుతాయి. ప్రజలు వైభవంతో ఉంటారు. కొఱ్ఱలు, రాగులు, మినుములు బాగా పండుతాయి. వానలు ఒకమోస్తరుగా కురుస్తాయి వంటి విషయాలు ఇందులో లేవు.

గ్రహగతులననుసరించి కరువు కాటకాలను గురించి ముందే తెలుసుకొనే విషయాన్ని కూడ దోనయ్య చెప్పలేదు. విష్ణుమాయా విలాసద్విపద కావ్యంలో కంకంటి నరసింహరాజు ఈ సంగతులు వివరంగా చెప్పాడు.

**ద్విపద: పవలార్ద్రబూనెఁ బ్రాక్పశ్చిమములను, గవి గురుల్ సమ సప్తకమున వర్తిలిరి**
**ధూమకేతువు దోఁచెఁ దూర్పున శుక్ర, సోమపుత్రుల నడిచో సూర్యుఁడుండె**
**మునుకొని శనిమీనమున వక్రవృత్తిఁ, గనె భాను భార్గవాగ్రగుఁడయ్యెఁ గుజుఁడు**
**అతిచార గతిఁజెందె నమరలోకాది, పతి మంత్రి శశిరక్త పరివేషమొందెఁ**
**జంచల చ్చంద్రికా ఛాయల మించె, ముంచి ప్రాతఃకాలముల మంచు గురిసె**
**రాతిరి నభము తారలఁబ్రకాశించె, నాతరి దుర్భిక్ష మావిర్భవింప**
**హరుని చిచ్చుఱకంటి హరువున చండ, కరుఁడు నిప్పులు భయంకర లీలఁగురిసె**

**– విష్ణుమాయావిలాసము తృతీయాశ్వాసము పుటలు 81,82.**

పగలు ఆర్ద్రకార్తె వచ్చింది. గురు, శుక్రులు తూర్పు, పడమరలలో ఉన్నారు. తూర్పున తోకచుక్క పొడిచింది. బుధ, శుక్రులకు మధ్య రవి ఉన్నాడు. రవి, శుక్రులకు ముందు కుజుడున్నాడు. శని మీనంలో ఉన్నాడు. బృహస్పతి అతిచారగతుడయ్యాడు. చంద్రుని చుట్టూ రక్త పరివేషం ఏర్పడింది. మెరుపు తెల్లగా ఉంది. ప్రాతఃకాలంలో మంచుకురిసింది. రాత్రులు ఆకాశం నిర్మలంగా తారలతో ప్రకాశిస్తూ ఉంది. అప్పుడు కరువు విజృంభించింది. హరుని మూడవకంటి నిప్పులాగా ఆకాశంలో సూర్యుడు నిప్పులు కురిపిస్తూ ఉన్నాడు. బావులు, చెరువులు, నదులు ఎండిపోయాయి. ఎక్కడా చుక్కనీరు లేదు – అని కరువు కాలంలోని గ్రహగతులను నరసింహకవి వర్ణించాడు.

ఇవన్నీ వర్షశాస్త్రంలోని భాగాలు. ఈ సంగతులన్నీ గ్రంథంలోని తర్వాతి అధికారాలలో చెప్పడానికి సంకల్పించుకొని ఉండవచ్చు. ఆయుష్షు గట్టిదై, ఆయన తన శాస్త్రపరిజ్ఞానాన్ని, అనుభవాన్ని రంగరించి పూర్తి గ్రంథాన్ని వ్రాసినట్లైతే ఆంధ్రులకు ఒక అపురూపమైన వర్షశాస్త్రగ్రంథము బహూకృతమై ఉండేది.

## సస్యానంద ప్రామాణికత

వర్షపాతాన్ని ఆధునిక శాస్త్రవేత్తలు మిల్లీ మీటర్లు, సెంటీమీటర్ల ప్రమాణాలతో కొలుస్తున్నారు. ప్రాచీన శాస్త్రవేత్తలు ద్రోణ ప్రమాణాలలో కొలిచారు. ద్రోణ ప్రమాణం ఎలా ఉంటుందో దోనయ్య కవి స్పష్టంగా చెప్పాడు.

**క. కొలువగ నరువదిమూడం । గుళములు ముఖవృత్తమైన కలశము దైవ ।**
**జ్ఞులు బయలనిలిపి వర్షము । వెలిసిన నవి నలుతుమైన వెస ద్రోణమగున్ ॥2-31**

63 అంగుళాల ముఖవృత్తంగల ఒక కలశాన్ని తీసికోవాలి. దానిని ఆరుబయట వర్షంలో ఉంచాలి. వర్షం వెలిసాక అందులోని నీరు 4 తూములుంటే ఒక ద్రోణం వర్షం కురిసిందని అర్థం. రెండుతూములుంటే అరద్రోణం వర్షం కురిసిందని అర్థం.

అనూరాధ నక్షత్రంలో తొలకరి వాన ప్రారంభమైతే 12 ద్రోణాల వర్షం, మూలా నక్షత్రంలో ప్రారంభమైతే 8 ద్రోణాల వర్షం, రేవతీ నక్షత్రంలో ప్రారంభమైతే 8 ద్రోణాల వర్షం, పూర్వాభాద్రలో ప్రారంభమైతే 2 ద్రోణాల వర్షం, పుష్యమిలో ప్రారంభమైతే 4 ద్రోణాల వర్షం ఆ సంవత్సరం కురుస్తుందని (సస్యానందం - 2-29) దోనయ్యకవి చెప్పాడు.

ఇవాళ ఆధునిక శాస్త్రవేత్తలు సాంకేతిక పరిజ్ఞానాన్ని ఉపయోగించి కృత్రిమ ఉపగ్రహాల సహాయంతో సునామీలు, భూకంపాలు, తుఫానుల రాకలను ముందుగానే పసిగట్టి ప్రజలను చైతన్య పరుస్తున్నారు. ఆనాడు శాస్త్రవేత్తలు గ్రహగతులు, భ్రమణాలను బట్టి వాతావరణ ఫలితాలను అంచనా వేసారు. ఈ కళ్లతో ఆనాటి శాస్త్రాన్ని చూస్తే చులకనగా కనబడుతుంది కాని, పరిశోధించి చూస్తే అందులో కూడా సత్యముందని తెలుస్తుంది.

చాగంటి శేషయ్యగారు తమ 16వ ఏటనే సస్యానందాన్ని చదివారు. అందలి సత్యాసత్యాలను శోధించాలనుకొన్నారు. అందులోను - రాత్రికురిసిన మంచును బట్టి రాబోయే సంవత్సరం వర్షపాతాన్ని ముందుగా అంచనా వేసే క్రింద పద్యం ఆయనను విశేషంగా ఆకర్షించింది.

సీ. దైవజ్ఞులాత్మమీదటి యేటవర్షంబు గొలఁదిని దెలియంగ గోరిరేని
పుష్యమాసంబున బున్నమ మునిమాపు దొరకొని పలిమెడు దూదియుంచి
మడక లోపల బెట్టి మఱుగేమియును లేని పొడవున నిడి వేగు బోకదూది
పిడువంగ ధారయై బెరసిన నయ్యేట వాన కాలములోన వఱపులేదు

ఆ.వె. అందులేక కొన్ని బిందువులగునేని । మధ్యవృష్టి దూదిమంచునీట ।
దోగదేని వానదోగదు మేదిని । చిన్మయ ప్రకాశ! శ్రీగిరీశ! ॥ **1-42**

వచ్చే సంవత్సరం ఎంతవాన కురుస్తుందో తెలిసికోవాలంటే – పుష్యమాసంలో పున్నమినాడు ప్రదోష సమయంంలో పలిమెడు దూది నాగలికి తగిలించి ఆరుబయట పెడతారు. దూదికి, ఆకాశానికి మధ్య ఏ అడ్డం ఉండకూడదు. మరునాడు ఉదయం దాక ఆ దూది అలాగే ఉండాలి. పొద్దున్నే ఆ దూదిని పిండాలి. ఆ దూదినుండి ధారగా నీళ్ళు కారితే వచ్చేసంవత్సరం వానలు పుష్కలంగా కురుస్తాయి. కొన్ని చుక్కలు కారితే మధ్యరకం వానలు కురుస్తాయి. మంచుకు దూది కొంచెం కూడ తడవక పోతే వానలు కురవవు అనావృష్టి ఏర్పడుతుందని ఈ పద్యం చెబుతుంది. దీనిని **తూలపరీక్ష**ంటారు. దీనిని చాగంటి వారు ప్రయోగాత్మకంగా చేసి, అందులో నిజముందని (ఆంధ్రకవితరంగిణి 4 సంపుట 1-45) కనుగొన్నారు.

కాళిదాసు మహాకవి వ్రాసిన మేఘసందేశంలో – ఆషాఢస్య ప్రథమదివసే – అన్న శ్లోకంతో మేఘుడు – కావ్యంలోకి ప్రవేశిస్తాడు. 365 రోజులలో ఆషాఢ శుద్ధ పాడ్యమినాడే కాళిదాసు మేఘుడిని ప్రవేశపెట్టడంలో చక్కని ఔచిత్యముందని ఆరుద్రగారు ఒక స్వారస్యం వెలికి తీసారు. ఏ సంవత్సరం ఆషాఢ శుద్ధ పాడ్యమి మృగశిరా నక్షత్రంతో కూడి ఉన్నప్పుడు దట్టంగా మబ్బులు పడతాయో, ఆ ఏడు తొలుకారు పంటలు బాగా పండుతాయని దోనయ్య కవి (2-45) చెప్పాడు. అంతేకాదు, ఆషాఢశుద్ధపాడ్యమినాడు సూర్యుడు అస్తమించే కాలంలో పడమట వైపు దట్టంగా మబ్బుపడితే ఆ సంవత్సరం కరువు ఉండదని బృహస్పతి ఆచార్యుని మతమని కూడ దోనయ్య (2-46) చెప్పాడు.

యక్షుడు తన కరువుదీరా సందేశం చెప్పి పంపించే మబ్బు కాబట్టి క్షేమదాయకమైన ఆషాఢశుద్ధపాడ్యమి మేఘాన్ని కాళిదాసు ప్రవేశపెట్టాడు. ఈ కవితా శిల్పరహస్యాన్ని అర్థం చేసికోవడానికి తోడ్పడిన దోనయామాత్యునకు కృతజ్ఞతలు చెప్పాలన్నారు ఆరుద్రగారు.

మన పూర్వులకు చదువు అంతగా లేకపోయినా వాతావరణాన్ని బాగా పరిశీలించారు. గాలి బాగా వీస్తే మబ్బులు చెదిరి వానలు కురవవని, గాలి వలననే ఉరుములు ఏర్పడతాయని, అన్నిటికి గాలే కారణమని తెలిసికొన్నారు. వాతావరణంలోని మార్పులను

మనుషుల కన్నా ముందు జంతువులే పసిగడతాయని ఆధునిక శాస్త్రపరిశోధనలు తెలుపుతున్నాయి. కుక్కలు, నక్కలు వంటి జంతువులు 20 హెర్ట్జులు తరచుదనం కన్నా తక్కువ తఱచుదనం (frequency) గల ధ్వనులను వినగలవు. భూకంపాల ప్రకంపనలను, సునామి కంపనాలను అవి ముందుగానే పసిగట్టి వికృతంగా అరుస్తూ ఉంటాయి. ప్రాచీనులు కూడా ఈ విషయాలను గ్రహించారు. ఊరిలో కుక్కలు సూర్యోదయానికి, సూర్యాస్తమయానికి కొంచెము ముందుగా అరవకుండా ఉంటే పైరులకు అవసరమైనంత వర్షం కురుస్తుందని దోనయ్య కవి (ససా. 3-26) చెప్పాడు. దీనిని ఆధునిక పరిజ్ఞానం ద్వారా నిర్ధారించవలసి ఉంది.

## సాహిత్యంలో కృషి ప్రపంచము

మన సమాజంలో వ్యవసాయమొక అంతర్భాగం. అందువలన పూర్వకవులు తమ కావ్యాలలో కృషి ప్రపంచాన్ని కొంత ప్రదర్శించారు. ఆనాడు మెరక ప్రాంతాలలోని వ్యవసాయం బావులపై ఆధారపడి ఉండేది. దిగుడుబావుల నుండి నీటిని ఏతాములతోను, మోటలతోను తోడేవారు. **సింహాసనద్వాత్రింశిక**లో దీనిని గోపరాజు ఇలా ప్రస్తావించాడు.

**ఉ. ఈయెడ గర్మభూమి యగుఁదెవ్వరికైనను బుద్ధినేర్పునం**
**జేయఁగలేదు కాలమెడఁ జేసిన నేతములెత్తి కాల్వలుం**
**బాయలుఁ గోళ్ళు నూతులును బావులు రాట్నములున్ జలార్థమై**
**చేయఁగ నాయెఁగాక మఱి చేయని నాడవి తామె పుట్టునే.**

**- సింహాసనద్వాత్రింశిక 6-70**

ఆ రోజులలో చెంచులు, కొండజాతులవారు, సంచారజాతులవారు అడవులలోని చెట్లను నరికి, ఆ ప్రాంతాన్ని చదునుచేసి, వ్యవసాయం చేసేవారు. ఆ చేనును పోడుచేను అని, ఆ వ్యవసాయాన్ని పోడు వ్యవసాయమని అంటారు. దీని ప్రస్తావన భోజరాజీయంలో ఉంది.

**చ. అని తన పోడుచేని కడకాతని దోఁకొని బోయ యి**
**ట్లను నివె పొట్టి కందులును నన్ములు నున్నవి క్రొత్త కుండ లే దనఘ!**

**- భోజరాజీయము 6-242**

అప్పటి మెరక పంటలు పొట్టి కందులు, అనుములు కూడ ఇందులో అనంతుడు ప్రస్తావించడం విశేషం. పంటలకు దృష్టి దోషం తగులకుండా దిష్టి పిడతలను పెడుతూ ఉంటారు. ఆ కాలంలో రైతులు, ఎరుకలు పొలాలలో గోవులు, ఎద్దుల తలలను, ఏనుగుల తలలను దంతాలతోపాటు నిలిపే వాళ్ళని ధూర్జటి కాళహస్తి మాహత్మ్యం వలన తెలుస్తున్నది.

**క. ఏనుఁగుల తలలు కొమ్ముల, తో నారబములకు దృష్టిదోషము వాయం**
**గా నెత్తుదు రెఱుకలు దమ, చేనికిఁ బసరంబు తలల చెలువం బెసఁగన్**

**– శ్రీకాళహస్తి మాహాత్మ్యము 3–8**

ఇవాళ కూడ ఈ దిష్టి బొమ్మలు ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క విధంగా దర్శన మిస్తున్నాయి. ఆనాడు పొలాలను కొలవడానికి ఒక విధమైన కఱ్ఱను ఉపయోగించేవారు. ఈ కర్రలలో రకాలున్నాయి. అందులో **కేసరిపాటిగడ** – అన్ని ప్రాంతాల వారిచే అంగీకరించబడిన కొలతబద్ద. దీని ప్రస్తావన ప్రత్తిపాడు శాసనంలో ఉంది. క్షేత్ర గణిత గ్రంథం ఈ కఱ్ఱను గుఱించి–

**సీ. అంగుష్ఠ నిర్ణయం బవని కేసరి పాటి–గడ ప్రమాణంబును గడయొసంగు**

– అని ప్రస్తావించింది. రాజులు ప్రజలమీద పన్నులు వేస్తారు. అందులో వ్యవసాయ దారులు చెల్లించే పన్నును కృషిప్రపంచమంటారని మడికిసింగన **సకలనీతిసమ్మతం** వలన తెలుస్తున్నది.

**చ. గనులు కృషిప్రపంచ మరి కప్పము సుంకము గోకులంబు నం**
**దనవనముం జలస్థల పథస్థ వణిక్క్రియ దుర్గ రక్షణం**
**బనఁగల యన్ని మార్గముల నర్థము గూర్పక కేవలంబ కాఁ**
**పున పొలియించు రాజు సిరిపొందునె రాజమనోజ భూభుజా**

**– సకలనీతిసమ్మతము 1–99**

ఇందులో కృషి ప్రపంచ మంటే రైతులు చెల్లించే పన్ను; గనులు అంటే గనులపైన విధించే పన్ను, గోకులము అంటే పశువులపై విధించే పన్ను, సుంకము అంటే బండ్లు మొదలైన వాహనాలపైన విధించేపన్ను, నందనవన మంటే ఉద్యానవనాలపై విధించే పన్ను, జలస్థల పథస్థ వణిక్క్రియ అంటే దుర్గరక్షణకు వ్యాపారంపైన విధించే పన్ను – అని అర్థం. ఇందువలన 14వ శతాబ్దం నాటి రైతులు సేద్యానికి, పశువులకు బండ్లకు కూడ పన్నులు చెల్లించేవారని తెలుస్తున్నది.

ఆధునిక కాలంలో శాస్త్రవిజ్ఞానం బాగా అభివృద్ధి చెందింది. ఆత్యాధునిక సాంకేతిక పరిజ్ఞానంతో మానవుడు ప్రకృతినే శాసించే స్థాయికి ఎదిగాడు. వర్షాభావ పరిస్థితులును ఎదుర్కోవడానికి అత్యాధునిక సాంకేతిక పరికరాలతో మేఘమథనం వంటి అసహజమైన పద్ధతులను అవలంబించాడు. అందువలన ప్రకృతి సమతుల్యత దెబ్బతింటున్నది. 2006–08 మధ్యకాలంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కృత్రిమ వర్షాలు కురిపించడానికి మేఘమథన ప్రక్రియ చేపట్టి కోట్లు ఖర్చుపెట్టింది. ఆశించిన ఫలితాలు రాలేదు. అనంతరకాలంలో తీవ్రవర్షాభావపరిస్థితులు నెలకొన్నాయి.

అభివృద్ధి ముసుగులో వాతావరణ కాలుష్యం అధికం కావడంతో గ్లోబల్ వార్మింగ్ పెరిగి ఉష్ణోగ్రతలు అమాంతం పెరిగిపోయి, ధృవప్రాంతాలలోని మంచు కరిగి, సముద్ర మట్టాలు పెరుగుతాయని, తీరప్రాంతాలలోని ఊళ్లు మునిగిపోతాయని శాస్త్రవేత్తలు హెచ్చరిస్తున్నా మనిషికి చీమకుట్టినట్లైనా లేదు. శాస్త్రపరిజ్ఞానాన్ని విచ్చలవిడిగా ఉపయోగిస్తూ, భూమి మీద ఇతర జీవుల ఉనికికి, ప్రకృతి సమతౌల్యానికి ఇబ్బందికరంగా మారాడు. పచ్చని చెట్లను పెంచి, ప్రకృతి సమతౌల్యాన్ని కాపాడినప్పుడే – చేవెలుగున వానకోసం ఆకాశం వైపు చూసే రైతుకు ఋతుపవనాలు కరిమబ్బులై ఆనందవర్షాన్ని ప్రసాదిస్తాయి. భూమిని సస్యశ్యామలం చేస్తాయి. అందుకు ప్రతివారు తమ పరిసరాలను అందమైన అరణ్యాలను చేయాలి. అప్పుడే ఆ గాలి కూనలు మబ్బుతల్లులను చల్లబరుస్తాయి. వర్షాన్నిస్తాయి. **సస్యానందం** కలుగుతుంది.

ప్రకృతిమీద ఆధిపత్యం కోసం ఆధునిక మానవుడు పరుగులు తీస్తున్నాడు. ప్రకృతిని ఆరాధిస్తూ వరాహమిహిర, దోనయామాత్యులు శాస్త్రగ్రంథాలు వ్రాసారు. అది వికృతి. ఇది ప్రకృతి. ప్రకృతి ఎప్పుడూ విపరీత ధోరణులకు పోదు. అలాంటి **శాస్త్రగ్రంథాన్ని వ్రాసిన దోనయకవి ఆంధ్రులకు స్మరణీయుడు**.

## భాషాంశాలు

సస్యానందంలో జ్యోతిషశాస్త్రపదజాలం పుష్కలంగా ఉంది. అయినప్పటికి ఇందులో చక్కని సాహిత్యాంశాలు కూడా ఉన్నాయి. ఒకచోట మబ్బులు కాటుక క్రోపులు (2–39) గా కన్పిస్తాయి. ఓరంతప్రొద్దు (1–44;3–26), నూలిపున్నమ (2–60), నోరికొలదులు (1–16) వంటి నుడికారాలు తళుక్కుమంటాయి.

దున్నుక, పూనుక వంటి ప్రయోగాలలో 'కొను' కు క కారాదేశం అంత ప్రాచీనంకాదు. తిక్కనయుగంలోని రంగనాథ రామాయణ యుద్ధకాండలో 'పట్టుకగ్రమింగె, కత్తిరించుకపోయె' – అన్న రూపాలు మొదటిసారిగా ప్రవేశించాయి. భాస్కరరామాయణంలో ఒకచోట 'ఎత్తుక' – అని ప్రయోగింపబడింది. తపోగ్రత వంటిరూపాలు ఎఱ్ఱనలో (నృసింహ పురాణం) కన్పించినా, అరణ్యపర్వశేషమును నన్నయ పద్ధతిలో వ్రాయడం వలన అటువంటి ప్రయోగాలు కన్పించవు. స్వచ్ఛంద ప్రయోగాలు ఎఱ్ఱన యుగంలోనే ప్రారంభమయ్యాయి. 'పట్టుక' – అని దోనయ ఒక్కచోట (సస్యా – 2–39) ప్రయోగించాడు. 16వ శతాబ్దం తర్వాత కావ్యాలలో ఇవి విరివిగా కన్పిస్తాయి.

ఒక పదంలోగాని, సమాసంలోగాని సంయుక్తాక్షరానికి ముందున్న అక్షరం గురు

వవుతుంది. సాధ్య సాంస్కృతిక సమాసాలలో, మిశ్రసమాసాలలో, ఆచ్ఛిక సమాసాలలో సంయుక్తాక్షరానికి ముందున్న అక్షరం గురువు కాదు. కేవలం సిద్ధ సాంస్కృతిక సమాసాలలోనే గురువవుతుంది. సిద్ధసమాసం కానిచోట కూడ సంయుక్త పూర్వాక్షరం గురువుగా కొన్ని ప్రయోగాలు కన్పిస్తున్నాయి.

**ఉ. దాసి వయస్యలెల్లఁ బొగడన్ బొగడ ప్రసూనముల్**

**-శృంగారశాకుంతలము 2-16**

ఇక్కడ 'పొగడ ప్రసూనముల్' మిశ్రసమాసం. ఇక్కడ 'డ' - గురువు కాకూడదు. కాని గురువయ్యింది.

**మ. మన మారంగ నొక క్షణంబయిన నిన్ మర్త్యుండు భావించి**

**- కుమారసంభవము 10-94**

ఇక్కడ ఒక క్షణము - మిశ్ర సమాసం. 'క' గురువు కాకూడదు. కాని గురువయింది. అనంతుడు ఈ అరుదైన ప్రయోగాలను సమర్థించాడు.

**గీ. ద్విత్వమున కాది వర్ణంబు తెలుగునందు, నూదకుండును వలసిన నూఁది యుండు**
**జానకీ వల్లభుఁడు క్షమాశాలియనఁగ, దశరథాత్మజుఁడు స్వామిధాత్రి కనఁగ.**

**- ఛందోదర్పణము 1-68**

మొదటిరెండు పాదాలకు మూడు, నాలుగు పాదాలు లక్ష్యాలు. మూడవ పాదంలో 'డు' - లఘువయింది. నాల్గవ పాదంలో 'డు' - గురువయింది. అనంతుడు చెప్పిన ఈ గురు లఘు పాక్షిక విధానం ఇతర లక్షణ గ్రంథాలలోగాని, ప్రసిద్ధకావ్యాలలోగాని కనబడదు. మహాభారతంలో -

**వీరావతార! సుకవిస్తుత! నిత్యధర్మ**
**ప్రారంభ! శిష్ట జనపాలనసక్త! రాజ**
**నారాయణాఖ్య! కరుణారస పూర్ణ!**

- ఇత్యాదిగా **వసంతతిలకవృత్త** పద్యముంది. రెండవపాదం చివర గల 'రాజ'లో జ - లఘువుగా ఉంది. కాని ఇది గుర్వంత పద్యం. కనుక జ - గురువు కావాలి. అందువలన పరిష్కర్తలు 'రాజా నారాయణాఖ్య' అని దిద్దారు. దాంతో ఆ బిరుదు వికారంగా తయారయింది. ఆంధ్ర మహాభారతంలోని ఛందస్సుల మీద అగాధమైన పరిశోధన చేసిన పాటిబండ మాధవశర్మగారు తమ సిద్ధాంత గ్రంథం 'ఆంధ్ర మహాభారతము - ఛందః

శిల్పము' లో అనేక ఛందశ్శాస్త్రాలను అవలోడించి పింగళ ఛందస్సు, ప్రాకృతపైంగలాల సూత్రాల లఘు గురు నిర్ణయాలతో 'జ' కార గురుత్వాన్ని సమర్థించారు.

"దీహో సంజుత్త పరో – బిందు జు ఓ పాడి ఓ ఆచరణాంతే
స గురు వంక దుమత్తో – అణ్ణోలహు హో ఇ సుద్ధ ఏక్క అలో

దీర్ఘము, సంయుక్త పరము, బిందు యుతము, చరణాంత పతితము నైన యక్షరము గురువు. అది ద్విమాత్రికము. అన్యమైన యక్షరము లఘువు ఏకమాత్రికము"

– ఛందఃశిల్పము పుటలు 68,69

ఇది ప్రాకృతపైంగల సూత్రం. పింగళముని సూత్రాన్ని కూడ శర్మగారు ఇచ్చారు.

**"దీర్ఘం సంయోగ పరం – తథా ప్లుతం వ్యంజనాంతమూష్మాంతం**
**సానుస్వరం చ గురు – క్వచి దవసానేఽ లఘ్వంతం"**

– ఛందఃశిల్పము పుట 70.

దీర్ఘాక్షరాలు, సంయోగపరమైన అక్షరాలు, ప్లుతాక్షరాలు, పొల్లక్షరాలు, ఊష్మాంతాలు, అనుస్వరంతో కూడినవి గురువులు అవుతాయి. అవసానాక్షర లఘువు కూడ గురువవుతుందని శ్లోకం చెబుతుంది. ఈ సంప్రదాయం ప్రకారం నన్నయ పద్యంలోని "రాజ"లోని పాదాంత లఘువు 'జ' – గురువే అవుతుంది. కనుక 'రాజా నారాయణాఖ్య' – అన్న దిద్దుబాటు అవసరం లేదు. ఇది సంస్కృత సంప్రదాయం. ఇతర తెలుగు కావ్యాలలో ఈ ప్రయోగం కన్పించదు.

సంస్కృతసమాసాలలో రేఫ సంయుక్తానికి ముందున్న అక్షరం గురువు అవుతుంది. నన్నయ భారతంలో ఇది రెండుచోట్ల లఘువుగానే కన్పిస్తుంది.

**ఉ. న, క్షత్ర యుతుండుగా శశిప్రకాశ జయోన్నతమైన యష్టమిన్ (ఆది 5-94)**

**క. అవనిజము వలన నమ్మిని – ప్రవరు పృథూత్సంగ తలముపై వడిఁబడియెన్**

**– సభాపర్వము 1-140**

ఈ ప్రయోగాలను సమర్థించడానికి పూర్వ లాక్షణికులు చాలా ప్రయత్నాలు చేసారు. 'తెలుగు భాషలో ఛందోరీతులు' అన్న గ్రంథంలో కీ.శే.రావూరి దొరస్వామి శర్మగారు దీనిని గుఱించి ఇలా వ్రాసారు.

"ఛందః కౌస్తుభము: వర్ణో గురుర్మతో హ్రప్రే పాదాంతే చాపి వా లఘుః

వృత్త ప్రత్యయకౌముది; అథ విభాషిత గశ్చరణాంతిమో, 'హ్ర ప్ర' పరో 'గ్ర' పరోపి చ కేచన.

ఈ లక్షణ విశేషములం బట్టి సంస్కృత భాషలో 'ప్ర – హ్ర – గ్ర' ఇత్యాది రేఫ సంయుక్తాక్షరములకుఁ బూర్వాక్షరము వికల్పముగ లఘువు గావచ్చునని తెలియవచ్చెడు" (పుట 34) అని వ్రాసారు.

ఇందలి 'ప్ర' కార పూర్వాక్షర లఘుత్వానికి పై నన్నయ ప్రయోగాలు, అనంతర కవుల ప్రయోగాలు లక్ష్యాలుగా కన్పిస్తాయి. 'హ్ర' కార పూర్వాక్షర లఘుత్వానికి ప్రయోగాలు అంతగా కన్పించవు. ఓగిరాల జగన్నాథకవి రాజు తన సుమనోమనోరంజనలక్షణ గ్రంథంలో దీనికి లక్షణ, లక్ష్యాలను ఇచ్చాడు.

**సీ. దేవ వల్లభ హ్రదినీ విలసిత మయ్యు – జంభ జయాధిక సంపదఁదగి**

ఈ సమాసంలో 'హ్ర' కు ముందున్న 'భ' – గురువు కాలేదు. ఇందుకు లక్ష్యంగా నాచన సోముని హరివంశం నుండి (ఇది ఉత్తరహరివంశంలో లేదు. పూర్వహరివంశం లోనిది కావచ్చును.) – **'శత తాళ దఘ్న హ్రదమున నుటికెన్'** – అన్న కంద పద్యపాదాన్ని ఉదహరించాడు. ఈ సమాసంలో 'హ్ర' కు ముందున్న అక్షరం 'ఘ్న' – గురువు కాలేదు.

క్రియ – అన్నది సంస్కృత పదం. 'విధము' అన్న అర్థములో ఇది తెలుగు పదం కూడ అవుతుందని శబ్దరత్నాకరం చెబుతుంది. తెలుగు పదంగా ఉన్నప్పుడు 'క్రియ'కు ముందున్న అక్షరం లఘువు అయిన ప్రయోగాలు తిక్కనలోను, కేతనలోను కన్పిస్తాయి.

**క. అ, శనిక్రియ నుగ్రమగు నసల శరమేసె వదీన్ (నిర్వచనోత్తరము 6–49)**

**క. ముని క్రియ నిప్పులుగ ముచ్చుముడిగిన దబలా! (దశకుమారం 3–109)**

ప్ర – హ్ర – గ్ర – లకు ముందున్న అక్షరాలకు సంస్కృత లక్షణ గ్రంథాలు లఘుత్వం చెప్పాయి. అనంతర కవులు అన్నిటిని వికల్ప లఘుత్వము చేసారు. అందుకు దోనయ్య ఆద్యుడుగా కన్పిస్తున్నాడు. ఆయన ప్రయోగాలు–

**సీ. కమనీయ ద్రోణంబు కాలమేఘంబును 1–16**

**ఆ.వె. ఘనప్రసూతి కాలమనిరి ఘనులు 1–20**

**ఆ.వె. చెలువు మిగులు మార్గశిర శుద్ధ ప్రతిపద 1–34**

**క. ఉత్తమ ద్రోణైక వింశనొసఁగు ఘనంబుల్ 2–27**

ఇందలి 2,3 ప్రయోగాలు పై సూత్రం ప్రకారం లఘువులే అవుతాయి. 1,4 ప్రయోగాలు లక్షణాన్ని అతిక్రమించి లఘువులయ్యాయి. ఇది జ్యోతిషశాస్త్ర గ్రంథం గనుక దీనినంతగా పట్టించుకొనవలసిన పనిలేదు. కాని ఇతని ననుసరించి అనంతరకవులు తమ కావ్యాలలో ఇలాంటి ప్రయోగాలు అరుదుగా చేసారు. అనంతర లాక్షణికులు వీటికి కూడ గతి కల్పించ వలసి వచ్చింది. పొత్తపి వేంకట రమణ కవి లక్షణశిరోమణిలో దీనికి గతి కల్పిస్తూ లక్షణం చెప్పాడు.

**గీ. సకల భాషా కవిత్వ ప్రచారములను, రహల సంయోగ వర్ణ పరత్వమైన**
**పూర్వవర్ణంబు లఘువగు భువి వికల్ప, మైన నొకచోట గురువగు నదియె కృష్ణ(2-22)**

దీని మూలశ్లోకం ఛందశ్శేఖరంలోనిదని రమణకవియే ఈ క్రింది శ్లోకాన్ని ఇచ్చాడు.

**సర్వాస్వపి చ భాషాసు రహ యుక్తేఽక్షరే పరే**
**పూర్వవర్ణస్య లఘుతా వేష్టాతు క్వాది కే పరే**

ఇది ఛందశ్శేఖరంలోనిదని వృత్తరత్నాకర ధీశోధినీ వ్యాఖ్య ఉదహరించింది. దీని వ్యాఖ్యాత కవి శార్దూల శ్రీనాథుడని, అతడు మన తెలుగు కవి శ్రీనాథుడు కాదని లక్షణ శిరోమణి పరిష్కర్త రావూరి దొరస్వామి శర్మగారు (పుట 46) వ్రాసారు. కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణసారసంగ్రహంలోను ఇదే లక్షణం చెప్పారు.

**గీ. సంస్కృత పదంబులొగి సమాసములు గూర్చు, నపుడు క్రారను గూడిన యక్కరంబు**
**లూఁది యుండు నొకొక్కచో నూఁదకుండుఁ, దెనుఁగు కృతులందు సామజాజిననిచోళ**

రేఫ సంయుక్తానికి ముందున్న అక్షరాన్ని – దోనయ్య ఇతర ప్రాచీన కవులు అరుదుగా లఘువును చేస్తే, ఆధునికులు దానిని పూర్తిగా అతిక్రమించడం దురదృష్టకరం.

సస్యానందంలో రెండుచోట్ల సంధి దోషాలు కన్పిస్తున్నాయి. అవి 1. చారుతర యిష్టములు (1-43), జ్యేష్ట శుద్ధ యష్టమి (2-19). ఇవి చారుతరేష్టములు, జ్యేష్ఠశుద్ధాష్టమి కావలసినవి. దిద్దితే గణభంగమవుతుంది. మూడుచోట్ల ద్రుతద్విత్వ సంధులు కన్పిస్తున్నాయి. అవి – అర్థిన్నెసగఁగ(4-45), అర్థిన్నెంతయు (4-46), నువ్వుల్లంటు వడు (4-51). ఈ సంధులు శృంగార శాకుంతలం (3-28; 3-62; 4-48; 4-170) లోను, మొల్ల రామాయణం (కిష్కింధ – 16, సుందర – 85) మరికొన్ని ఇతర కావ్యాల లోను కన్పిస్తాయి. ఇంకొక చోట మృగశిర అనుటకు – మృగశీరుషము (2-12) అన్న ప్రయోగం కన్పిస్తుంది. ఒకచోట వైశాఖ పున్నమ (2-4) అన్న వైరి సమాసం ఉంది.

ఈ గ్రంథంలో రెండుచోట్ల అఖండ యతులున్నాయి.

**ఆ.వె. ఆరునెలలలోన నధిక వర్షంబుచే - నిల సమృద్ధి నొందు నీలకంఠ 2-20**

**క. కాంతలగొని యెల్ల దిశల కఱుఁగుదు రర్థిన్ 4-46**

ఒకచోట 'ఖ' కు - 'మ'కు యతి కన్పిస్తున్నది. ఇది అప్రశస్తము.

మత్తకోకిల: మానుగా కరివైరి జెంది బస్తులో గురుఁడుండగా 2-29

ఒకచోట అప్రశస్తమైన 'భృ - పో' యతి కన్పిస్తున్నది.

**సీ. సురమంత్రి గూడినఁగరియూథములు గ్రుంగు - భృగునందనుఁడు దూరిపోయెనేని**

ఈ యతులుగూడ ఎఱ్ఱనయుగ కావ్యాలనుండే ప్రారంభమయ్యాయి. ఈ యుగ కావ్యాలనుండి ఇటువంటి మరికొన్ని యతిప్రయోగాలు చూడండి.

**సీ. క్రూరార్ద్ర చంద్రాస్త్ర కృతోరు బాహులై (భాస్కర యుద్ధ 1449)**

**గీ. తృణ కణాంశంబు వజ్రమై త్రుంచునట్లు (వాశిష్ట రామా - 3-234)**

**నిఘంటువుల కెక్కని పదాలు** : ఈ గ్రంథంలో నిఘంటువుల కెక్కని పదాలు కొన్ని ఉన్నాయి. 'తొలుతటి వానలోఁదోయంబు లొగరైన, వట్టైన యగునేని కొఱ్ఱచేలు' (2-41) పద్యానికి - తొలకరి వాన నీళ్లు వగరుగా ఉన్నా, వట్టిగా ఉన్నా కొఱ్ఱపంట బాగా పండుతుందని అర్థం. ఇందలి వట్టి - అన్నపదం శబ్దరత్నాకరంలోగాని, సూర్యరాయాంధ్ర నిఘంటువులోగాని, ఆంధ్రశబ్దరత్నాకరంలోగాని లేదు. బ్రౌణ్యం దీనిని స్వీకరించి 'కారము' అని అర్థం చెప్పింది. వాయుప్రకారం అన్న సందర్భంలో-

**క. తలివమ్ము ముతక నూలునఁ, జెలువారిన లీల నాల్గుచేతుల నిడుపున్**
**నలిచేతెడు వెడలుపునయి, యలవడఁగావించి యుందు నందముగాగన్ (2-55)**

అన్న పద్యం ఉంది. ఇందలి 'తలివమ్ము' - అన్న పదానికి పరుపు, శయ్య అన్న అర్థాలున్నాయి. ఇక్కడ కంబళి, దుప్పటి అని అర్థం. నిఘంటువు లీయర్థాన్ని కూడ స్వీకరించాలి. ఇందలి నలిచేతెడు - అన్న పదం నిఘంటువులలో లేదు. వ్యాఖ్యాత సంగ శేషాచల శాస్త్రిగారు మహా విద్వాంసులు గనుక, చేతిని బారగా తీసికొని, నాల్గు చేతులు అంటే నాలుగు రెండ్లు ఎనిమిది మూరలు అని, నలిచేతెడు అన్న దానిని ఒకబార అంటే రెండు మూరలు అని అర్థం వ్రాసారు. ఇది చింత్యము. ఇంకొక చోట-

**క. నింగికిఁజంద్రాత్మజునకు, ముంగలియై వానజేయు మొగి భార్గవుఁడా**
**నింగికిఁ దత్పుత్రునకున్, వెంగలియై సస్యకోటి పెంపడఁగించున్ (4-2)**

వెంగలి అంటే అవివేకి, జడుడు, మూఢుడు – అని నిఘంటువులన్ని అర్థం చెప్పాయి. ఇక్కడ కవి వెనుక – అన్న అర్థంలో ప్రయోగించాడు. ఈ పద్యంలో ఇది ముంగలికి వ్యతిరేకపదంగా కూడ అన్పిస్తుంది. ప్రతిపద అంటే పాడ్యమి అని అర్థం. కవి దీనిని రెండుచోట్ల (3–10; 1–34) ప్రయోగించాడు. ఇది నిఘంటువుల కెక్కలేదు. ఇటువంటి జ్యోతిషశాస్త్రపదజాలాన్ని కవి విరివిగా వాడాడు. వాటికి తానే అర్థాలను కూడ ఇచ్చాడు. వాటిలో కొన్ని – వాయుతార = స్వాతి నక్షత్రం (2–7,3–59); బస్త = మేషరాశి (2–9); అనిలము = స్వాతి నక్షత్రం (2–26); హారము = ఆర్ద్రా నక్షత్రం (2–27); దేవమాత = పునర్వసు నక్షత్రం (2–27) మొదలైనవి చాలా ఉన్నాయి. ఇవి కూడ నిఘంటువుల కెక్కితే బాగుంటుంది.

ద్వాదశి అన్నపదానికి వికృతి దోదసి, బారసి – దోనయ్యకవి బారసి (1–43,2–1) అని రెండుచోట్ల ప్రయోగించాడు. అచ్చులో పారశి అని ఉండడంతో ఆరుద్రగారు అలాగే పఠించి నిఘంటువుల కెక్కలేదన్నారు. భాగవత పాఠ పరిశోధనంలో దీపాల పిచ్చయ్య శాస్త్రిగారు ఆరుద్రగారిది పొరపాటని, దాని అసలు రూపము బారసి – అని చెప్పి, నిఘంటువులిచ్చిన రూపము, ప్రయోగాలను ఉదహరించారు.

## విశేషవృత్తాలు

సస్యానందంలో మొత్తం 235 పద్య గద్యాలున్నాయి. వీటిలో 26 వచనాలు ఉన్నాయి. ఇవన్నీ దాదాపు ఏకవాక్యంతో ముగిసిపోయినవే. కందాలు 107, ఆటవెలదులు 60, ఒకే ఒక్క తేటగీతి, 17 సీసపద్యాలు, 6 ఉత్పల మాలలు, 4 చంపకమాలలున్నాయి. మొత్తం గ్రంథంలో రెండువంతులు కందాలే ఆక్రమించాయి. దోనయ్య ఆటవెలది నడక అసమానమైనది. వేమనంతటి వాడికే దారిచూపిందా అన్నంత అందంగా అతని ఆటవెలదులు నర్తిస్తాయి. అవతారికలో ఆయన చెప్పుకొన్నట్లే అతని పద్యంలో సదమల వాక్య స్ఫురణ, పదలాలిత్యం (1–15) శోభిస్తుంటాయి.

దోనయ్యకవి కొన్ని విశేష వృత్తాలను కూడ ప్రయోగించాడు. అవి – తోటకము, (2–2), మత్తకోకిల (1–50,2–9,3–1), తరువోజ (2–5,2–18), మానిని (2–6,2–49), కవిరాజవిరాజితము (2–17,3–11), తరలము (3–59), చౌపద (4–18)లు.

1. **తోటకము** : గణాలు: స–స–స–స.; 9వ అక్షరం యతిస్థానం. ఈ లక్షణంతో దోనయ్య కవి ఒక తోటక వృత్తం వ్రాసాడు. కామందకంలో జక్కరాజు వేంకటకవి 7వ అక్షరానికి యతివేసాడు.

2. **మత్తకోకిల** : గణాలు : ర–స–జ–జ–భ–ర; 11వ అక్షరం యతిస్థానం. ఈ లక్షణంతో దోనయ్య 3 మత్తకోకిలలు ప్రయోగించాడు. ఇది చాలామందికి ప్రాచీన కవులకు ప్రియమైన వృత్తం. ముఖ్యంగా పోతన్నకు.

3. **తరలము** : గణాలు : న–భ–ర–స–జ–జ–గ; 12వ అక్షరం యతిస్థానం. దోనయ ఒక్కతరల పద్యం వ్రాసాడు. మత్తకోకిల లోని మొదటి గురువును రెండు లఘువులు చేస్తే తరల పద్యమవుతుంది.

4. **మానిని** : గణాలు : భ–భ–భ–భ–భ–భ–భ–గ; 1,13,19 అక్షరాలు యతిస్థానాలని విన్నకోట పెద్దన, అనంతుడు, రంగకవి చెప్పారు. అప్పకవి 13వ అక్షరం యతి (ఒక యతి) అన్నాడు. చిత్రకవి పెద్దన మానినిలో యతివైకల్పికమన్నాడు. నన్నయ, నన్నెచోడులు 13వ అక్షరానికి యతి వేసారు. తిక్కన రెండుమతాలు పాటించాడు. దోనయ నన్నయననుసరించి 13వ అక్షరానికి యతి వేసి, రెండు మానినులను వ్రాసాడు. ముద్రిత ప్రతిలో మాలిని అని చెప్పబడింది.

5. **కవిరాజవిరాజితము** : గణాలు : న–జ–జ–జ–జ–జ–జ–లగ; 8–14–20 అక్షరాలు యతిస్థానాలని విన్నకోట పెద్దన, అనంతుడు, అప్పకవి చెప్పారు. రంగకవి 14వ అక్షరం యతి (ఒకయతి) అన్నాడు. నన్నయ, నన్నెచోడులు 14వ అక్షరానికి యతివేసారు. వాళ్లననుసరించి దోనయ్యకవి కూడ 14వ అక్షరానికి యతివేసి, రెండు కవిరాజ విరాజితాలను వ్రాసాడు. మానిని వృత్తంలోని మొదటి గురువును రెండు లఘువులు చేస్తే కవిరాజవిరాజిత మవుతుంది.

6. **తరువోజ** : ఇది చాలా ప్రాచీన ఛందస్సు. గణాలు : 2 ఇంద్ర గణాలు + ఒక సూర్య గణం + 2 ఇంద్ర గణాలు + 1 సూర్యగణం; 3,5,7 గణాల ప్రథమాక్షరాలు యతిస్థానాలు, ప్రాస ఉంటుంది. మొత్తం 3 యతులు అంటే బహుయతి నియమం ద్విపదకు రెట్టింపు తరువోజ. రెండు ద్విపద పాదాలు ఒక తరువోజ పాదమవుతుంది. దోనయ్య తరువోజలలో ఈ బహుయతి గతిదప్పింది.

<u>మా</u>నుగ <u>వై</u>శాఖ <u>మా</u>సంబు – గృష్ణ, <u>పా</u>ద్యమి యాదిగా <u>బ</u>ఱఁగు నాల్గు 2–5

ఇందులో పూర్వార్ధంలో ఒకయతి, ఉత్తరార్ధంలో ఇంకొక యతి పడింది. దోనయ్య తరువోజలు (2–5; 2–18) రెండూ ఇలానే ఉన్నాయి. ఇది తరువోజ లక్షణానికి విరుద్ధం. అందువలన ఆరుద్రగారు, ఇవి తరువోజలు గావు మంజరీ ద్విపదలున్నారు. నేనెఱిగినంతలో ప్రాచీన పద్య కావ్యాలలో ద్విపదలు, మంజరీ ద్విపదలు లేవు. ఆధునికులలో శ్రీపాద

కృష్ణమూర్తి శాస్త్రిగారు తొలిసారిగా తమ భారత, భాగవత, రామాయణ పద్యకావ్యాలలో ద్విపదలు, మంజరీ ద్విపదలను ప్రవేశపెట్టారు. తర్వాతి ఆధునికులు దీనిని అనుసరించారు. తెలుగులో ఉన్న ఏకైక మంజరీ ద్విపద కావ్యం పల్నాటి వీర చరిత్ర మాత్రమే.

మరి దోనయ్య తరువోజలను యతుల పరంగా ఎలా సమర్థించాలి? కవిజనాశ్రయం కొన్ని ప్రాత వ్రాతప్రతులలో తరువోజ లక్షణం తరువోజ ఛందస్సులోనే ఇలా ఉంది.

ఇల నింద్ర గణములు నినునితోఁగూడ, నాలుగుగాఁజేసి నయముతోడుతను

ఇందులో బహుయతి నియమం తప్పింది. మరికొన్ని వ్రాతప్రతులలోను ముద్రిత ప్రతులన్నిటిలోను ఈపాదం – నలనామ గణము లిన గణంబుతోడ, నాలుగుగాఁజేసి నాటించి యిట్లు" – అని ఉంది.

ఎఱ్ఱన హరివంశంలో తరువోజ (పూర్వభాగం 7–58) మొదటి మూడు పాదాలు బహుయతి లక్షణంతో ఉంది, నాల్గవ పాదం దోనయ్యవలె యతిగతిమారింది.

దయనిమ్ము జీవిత దానమ్ము నాక, భయ వరణాగతఁబ్రార్థింతు నిన్ను

బహుయతి నియమం తప్పింది. వ్రాత ప్రతులలోను, యద్దనపూడి వారి ముద్రిత ప్రతిలోను ఉన్న ఈ పాఠాన్ని చూపిస్తూ వజ్ఝలచినసీతారామశాస్త్రులుగారు ఆంధ్ర ఛందస్సులు అన్న వ్యాసంలో – తరువోజకు సీసపద్యానికి వలె పూర్వార్థాన ఒకయతి, ఉత్తరార్థాన ఒకయతి ఎఱ్ఱాప్రెగ్గడ నిలిపాడని వ్రాసారు. అందువలన తరువోజకు యతి విషయంలో రెండుమతాలున్నాయా? – అన్న సందేహం కలుగుతుంది. వావిళ్ళవారి ప్రతిలో ఈపాఠం – 'దయనిమ్ము జీవిత దానమ్ము నాకుఁ, దగ శరణాగత త్రాతవుగావె' అని దిద్దబడింది.

నన్నయ తిక్కనాదుల తరువోజలలో బహుయతి నియమమే ఉంది. అప్పకవి ఇచ్చిన లక్ష్యంలో 4వ పాదంలో మరలా బహుయతి నియమం తప్పింది.

'కృతులందుఁదర్వోజనీయోజనెసఁగ; గృతకృత్యుఁడై చెప్పు క్షితినెల్లసభల' ఇందులో ఉత్తరార్థంలోని చివరియతిస్థానం తప్పింది.

దోనయ్య చేసిన ఈ ప్రయోగాన్ని సమర్థించడానికి ఇంతకుమించి ఉపపత్తులు నాకు లభించలేదు. విజ్ఞులీ వ్యాసఘట్టాన్ని ఇంకా విచారిచవలసి ఉంది.

7. **చౌపద** : గణాలు : నల–గగ–భ–స; మూడవగణం ప్రథమాక్షరం యతిస్థానం. ప్రాస ఉంటుంది. కవిజనాశ్రయం దీనికి లక్షణం (జాత్యధికారం – 32) చెప్పింది. విన్నకోట పెద్దన దీనికి అంత్యానుప్రాసకూడ ఉందన్నాడు. అంత్యప్రాస పాటించకుండ దోనయ్య

ఒక **చౌపద** వ్రాసాడు. అది–

**ఎసఁగఁగసితునకు నేడగుచోటన్ । మసలిన శనికిని మానుగసోముల్ ।**
**వెసగనుగూడిన వెసమేఘంబుల్ । వసుమతినుడుగని వానలుజేయున్ ॥4–18**

ముద్రితప్రతులలో ఇది మణిమంజరి ఛందస్సుగా – చెప్పబడింది. ఆ పేరుతో ఏ ఛందస్సులేదని రావూరి దొరస్వామి శర్మగారు తమతో అన్నారని, అది మధురగతి రగడ అని ఆరుద్ర గారు సమగ్రాంధ్ర సాహిత్యం (3సం. 208)లో అన్నారు. కాని ఇది చౌపద. నన్నయ, తిక్కన, ఎఱ్ఱన యుగ కావ్యాలలో రగడలు కన్పించవు. ఆంధ్రకావ్యాలలో శ్రీనాథుడు మొదట రగడలను ప్రవేశపెట్టాడు. అనంతర ప్రబంధాలలో రగడలు విరివిగా కన్పిస్తాయి. నాలుగు పాదాల రగడలను ఏకవీ వ్రాయలేదు. వ్రాయడు. యక్షగానాల్లో ఉంటే ఉండవచ్చును. మధురగతి రగడకు, చౌపదకు దగ్గర సంబంధం ఉంది. మాత్రా ఛందస్సు ప్రకారం రెంటిలోను 16 లఘువులుంటాయి. ఆంధ్రమహాభారతంలో ఒక్క చౌపద కూడా లేదు. తెనాలి అన్నయ్య సుదక్షిణాపరిణయ కావ్యంలో, విన్నకోట పెద్దన చెప్పిన అంత్య ప్రాసతో ఒక చౌపద వ్రాసాడు.

**చిన్నది యొక్కతె చెందొవ క్రోవిన్, దిన్నగఁ జిమ్మెను దేనియ తావిన్**
**మన్నన సేయుచు మారుని ఠీవిన్, బన్నిన ఖచరుని పవడపు మోవిన్ (3–89)**

సంస్కృతలక్షణగ్రంథాలలో రగడల ప్రస్తావన లేదు. రగడలు, చౌపదలు దేశి ఛందస్సులు కావచ్చును.

## ప్రతులు – పరిష్కరణ

మద్రాసుప్రాచ్యలిఖితభాండాగారంలో దీనికి బ్రౌనుదొరగారు సంపాదించిన 4 తాళపత్ర ప్రతులు, 2 కాగితపుప్రతులున్నాయి. అందులో రెండు తాళపత్ర ప్రతులు బాగా శిథిలమయ్యాయి. మిగిలిన 2 తాళపత్ర ప్రతులలో ఒకదాని సంఖ్య 2385. రెండవదాని సంఖ్య తెలియరాలేదు. రెండు కాగితపు ప్రతులలో ఒకదాని సంఖ్య 2340. రెండవ దాని సంఖ్య తెలియలేదు. ఈ వ్రాత ప్రతులన్నింటిలోను అవతారిక అరకొరగా ఉందని, ప్రథమ ముద్రణ ప్రతిలో ఉన్నట్లుగా అవతారికతో కొన్ని వ్రాత ప్రతులు దేశంలో ఉన్నట్లుగా నిడుదవోలు వారు ఊహించారు. కనుక ప్రథమ పరిష్కర్త తడకమళ్ల కృష్ణరావుగారు మద్రాసు ప్రతులను ఎరిగినట్లు లేదు. ఆయనకు లభించిన మూలప్రతి ఇంకొకటి కావచ్చు. అవతారిక, గ్రంథ రచనాకాలము తెలపు పద్యము గల తాళపత్ర ప్రతి ఒకటి నిడుదవోలు వారి తండ్రి సుందరంగారి గ్రంథ సంచయంలో ఉండినది.

కృష్ణరావుగారికి లభించిన మూలప్రతి దోషభూయిష్ఠమైనది కావచ్చును. ఆయన ఎంతో శ్రమించి దానిని సంస్కరించి ఉంటారు. అయినా కొన్ని అపరిష్కృతంగానే ఉన్నాయి. ఆ ముద్రిత ప్రతి 1915, 1921 లలోను యథాతథంగా అచ్చయింది. నేను 1921 నాటి ముద్రిత ప్రతిని ఆధారంగా తీసికొని, నిడుదవోలు వారి వ్యాసం ఆధారంగా నాపరిమితులకు లోబడి దీనిని సంస్కరించాను.

1921 నాటి ప్రతిలో అరసున్నలు లేవు. శకటరేఫలు బొత్తిగా లేవు. అడుగడుగునా అచ్చుతప్పుల చీకాకులు. కొన్నిచోట్ల గణాలు పోయాయి. ఆటవెలదులన్నీ గీత పద్యాలుగా గుర్తించబడ్డాయి. విశేషవృత్తాలను గుర్తించడంలోను పొరపాట్లున్నాయి. వీటిని సరిచేసాను.

ముద్రిత ప్రతులన్నిటిలోను అవతారికలో 12వ పద్యం '–గోనయ నామధేయుఁడ వికుంఠ చరిత్ర రసైక లోలుఁడన్' – అని ఉంది. వ్రాతప్రతులలో ఉందని నిడుదవోలు వారు చెప్పిన – 'దోనయ నామధేయుఁడ విధూత కళంక చిత్తుఁడన్' పాఠాన్ని ప్రధాన పాఠంగా తీసికొని పూర్వముద్రిత పాఠాన్ని జ్ఞాపికలో చూపించాను. వ్రాత ప్రతులలో ఉన్న గ్రంథరచనా కాలాన్ని తెలిపే కందపద్యం – 'కరినగదినకర' పద్యాన్ని చతుర్థాధికారం చివరన చేర్చాను. వ్రాతప్రతులన్నింటిలోను కావ్యం అధికారాలుగా విభజింపబడింది. ముద్రిత ప్రతులలో ఆశ్వాస విభజన ఉంది. దీనిని కూడా అధికారాలుగా మార్చాను.

ముద్రిత ప్రతిలో తరువోజ (2–5) పద్యం గణభంగముగా ఇలా ఉండింది.

**తరువోజ.** **మానుగ వైశాఖ మాసంబులో గృష్ణపాద్యమి యాదిగా బరగునాల్గు ।**
**దినములు బరగు నాదినము నైపారగ మహిమీద శ్రావణ మాసంబులాది ।**
**గా నాల్గునెలలకు గాన యద్దివసముల గాలియును నెండ మెరుగుగలుగు**
**నన్నెల వరపని రార్యజనులు శీతపద్మసంకాశ శ్రీగిరీశ ॥ 2–5**

ఇందులో గణభంగాలు, నాల్గవ పాదంలో ప్రాస పోయాయి. ఇలా సంస్కరించాను.

**తరువోజ.** **మానుగవైశాఖ మాసంబు గృష్ణ, పాద్యమి యాదిగా బఱగెడి నాల్గు ।**
**దినములు బఱగు నాదినము నైపాఱ, మహిమీద శ్రావణ మాసంబులాది ।**
**గా నాల్గునెలలకు గాన యద్దివస, ముల గాలియును నెండ మొయిళులుగల్గ**
**నా నెల వఱపని రార్యజనములు, సితపద్మసంకాశ! శ్రీగిరీశ! ॥**

ముద్రిత ప్రతిలో రెండవ తరువోజ (2–18) కూడ దోషభూయిష్టంగా ఉంది.

అక్కరతరువోజ. **మానుగా జ్యేష్ఠమాసము పెంపులోను పుడుపతి యాషాఢ యుగములనొండె ।**
**మానమై రోహిణీ మధ్యంబు నొండె జనజొచ్చి వెడలిన జలధారల వని ।**

**భాసిల్లగర్భ సంపదపెంపు పెలుచ గాగనవ్వని వానకాలంబులోన ।**
**వానలులేవని వలనుమీరంగ మునుజెప్పె కైలాసమున నీశ్వరుండు ॥18**

దీనినిలా సంస్కరించాను.

**మానుగా జ్యేష్ఠమాసము పెంపులోన, నుడుపతి యాషాఢ యుగములనొందె ।**
**మానమై రోహిణీ మధ్యంబు నొందె, జనజొచ్చి వెడలిన జలధార లవని ।**
**మానిత గర్భ సంపదపెంపు పెలుచ, గాఁగ నవ్వని వానకాలంబులోన ।**
**వానలులేవని వలనుమీఱంగ మునుజెప్పె కైలాసమున నీశ్వరుండు ॥ 18**

ప్రథమపాదంలో యతిని దిద్దడం వీలుపడలేదు.

నా సవరణలు సంగ్రహంగా చూపిస్తాను.

1. సొంపు వహింపగ నారతంబు (పూర్వ ముద్రణ పాఠం) 1-2
   సొంపు వహింప ననారతంబు (దిద్దిన పాఠం)
2. ప్రాకటముగ సర్వలోకాశ్రయము జెప్పి (పూ.ము.పా.) 1-14
   శ్రీకరముగ సర్వలోకాశ్రయముఁజెప్పి (ది.పా.)
3. తారలందు నెరనెరయగ తొలువానలు (పూ.ము.పా.) 2-26
   తారలందు నెరయఁగ తొలువానలు (ది.పా.)
4. దారుణంపు మొగులు వాయుపథంబున (పూ.ము.పా.) 2-15
   వారుణంపు మొగులు వాయుపథంబున (ది.పా.)
5. గలుగవు వానలు ధారుణిపైనని గర్గవరాహులు కడుమది నా
   కులమున జెప్పిరి (పూ.ము.పా.) 2-17
   గలుఁగవు వానలు ధారుణిపైనని గర్గ వరాహులు గాడ్పడి నా
   కులమునఁ జెప్పిరి. (ది.పా.)
6. కనుగొనగ మృగశీర్షమె తుదగా గల రిక్కులులో వారుణముల్ (పూ.ము.పా.)3-11
   కనుగొనఁగా మృగశీరుషమే తుదగా గల రిక్కల వారుణముల్ (ది.పా.)
   మృగశీరుషము - అని కవి ఇంకొక చోట ప్రయోగించాడు.
7. ఘనసౌధవితతి రీతి (పూ.ము.పా.) 3-32
   నవసౌధ వితతి రీతి (ది.పా.)

8. కోకిలంబునే, పున గడికున్న యట్టిగతి (పూ.ము.పా.) 2-66

కోకిలంబు నే, పున పసికూన యట్టి గతి (ది.పా.)

9. పలిమేడుదూది... వేగబోగ (పూ.ము.పా.) 1-42

పలిమెడు దూది... వేగుబోక (ది.పా.)

10. సం, హారము జేయునాతనికి వావిరిఁదోడ్పడి గ్రుంకి యుర్వికిన్ (పూ.ము.పా.)4-3

ఇక్కడ 'హ' కు 'వా' కు యతి పడింది. శ్రీశ్రీ కూడ ఒకచోట 'ర'కు - 'ఠ'కు యతివేసాడు. 'యతి ఏది స్వామీ' - అని ఎవరో అడిగితే ఆయన ఠక్కుని 'నేత్రయతి' - అని చమత్కరించాడంటారు. ఈ 'హా - వా' యతి కూడ అటువంటిదే. దీనిని - 'సం, వారముఁ జేయునాతనికి వావిరిఁ దోడ్పడి గ్రుంకి యుర్వికిన్' - అని దిద్దాను.

11. కుసుమ ప్రత్తినువ్వుకొలఁదులు నధికంబు, ఎండ తేజముండదంద్రు వడు 2-43

ఇక్కడ 'ఎండ - దంద్రు' ప్రాసయతి పడింది. అప్రశస్తము. కాని శివకవులలో ఇది సహజం. అందువలన దిద్దలేదు. చివరి పదం 'వడు'ను 'విదులు' - అని దిద్దాను. దిద్దడానికి వీలుపడనివి కొన్ని ఉన్నాయి.

తోటకము : అ, వ్వలికారున వానలు నల్పమగున్ (2-2)

ఇక్కడ 'వ'కు 'అ'కు యతి పడింది. కవి దృష్టిలో ముందు పాదంలోని 'అ'కు 'అల్పమగున్' లోని 'అ'కు యతి కాని 'ప'కు - 'అ'కు యతి పడింది. దీనిని దిద్దలేదు. ఈ భ్రమను గుఱించి నేను పరిష్కరించిన మృత్యుంజయశతకంలో కొంత చర్చించి, ఇతర కవుల ప్రయోగాలనూ ఇచ్చాను. ఈ ప్రమాదమే దోనయ్యలో ఇంకొకచోట కన్పిస్తుంది.

క. శని చంద్రులేక తారను, జనుచుండఁగ వాన దొడఁగ దజ్జన పదముల్
బొనుపడు రాష్ట్రభయంబొం, డెను వ్యాధి భయంబు బీడజేయుట యొండెన్ (2-37)

ఇక్కడ 2,4 పాదాలలో యతి తప్పింది. 2వ పాదంలోని యతిభ్రంశం పైన చెప్పిన 'వ-అ' వంటి భ్రమ ప్రమాదమే. నాల్గవ పాదం దిద్దడానికి వీలుపడలేదు. ఒకచోట-

క. కొలువఁగ నరువది మూడం - గుళములు ముఖవృత్తమైన కలశము (2-31)

రెండవ పాదంలో 'గు' కు - 'క' కు యతి పడింది. కుంభము అనికాని, కుండిక అనిగాని దిద్దవచ్చు. ఇలాంటిచోట 'కలశము' - అన్న శబ్దమే యోగ్యముగా తోచింది. ఇంకొకచోట

క. ఉత్తర మరి పుష్యంబులు, చిత్తను హర దేవమాత జలమగు పుబ్బన్ (2-27)

రెండవ పాదంలో 'చి' కి – 'జ'కు యతి పడింది. ఇందలి ఉత్తర, పుష్యమి, చిత్త, హర (ఆరుద్ర), దేవమాత (పునర్వసు), జలము (పూర్వాషాఢ), పుబ్బ – ఇవన్ని నక్షత్రాలు, జ్యోతిష శాస్త్ర పదాలు. దిద్దడానికి వీలు పడలేదు.

తాత్పర్యాలు లేనిదే ఈ గ్రంథం సులువుగా అర్థం కాదు. సంగ శేషాచలశాస్త్రిగారు ఎంతో శ్రమించి మూలభావాలతో తాత్పర్యాలు వ్రాసారు. వారి శ్రమ అమూల్యము. ఆయన తండ్రి లక్షణావధాని. భగవద్గీతకు భాష్యార్థచంద్రికా వ్యాఖ్య వ్రాసిన మహావిద్వాంసులైన నోరి గురులింగశాస్త్రిగారు ఆయన గురువు. ఈ తాత్పర్యాలు నాశ్రమను కొంత తగ్గించాయి.

ఈ పీఠిక వ్రాయడానికి కీ.శే.నిడుదవోలు వేంకటరావుగారి భారతిలోని వ్యాసం కీ.శే.రావూరి దొరస్వామి శర్మగారి ఛందోరీతులు కొంతవరకు ఉపకరించాయి. ఆ భారతీ భక్తులకు నా నమస్సులు. ఎడనెడ నాకేర్పడిన సందేహాలు తీర్చిన డా॥ వద్దేపల్లి శ్రీనివాసరావు గార్కి, డా॥ ఉయ్యూరు లక్ష్మీనరసింహారావు గార్కి, శ్రీ ఇప్పగుంట సాయిబాబా గార్కి నా కృతజ్ఞతలు.

**దాదాపు 660 సంవత్సరాల నాడు ఆంధ్రసాహిత్య భూమిపై కురిసిన తొలి తొలకరి తేనెజల్లు ఈ సస్యానంద వర్షశాస్త్రం.** నాటి నుండి ఆ జల్లులు సాహిత్య క్షేత్రాన్ని సస్యశ్యామలం చేస్తూనే ఉన్నాయి. నిత్యం సంస్కృత సాహిత్య క్షేత్రంగా భాసించే శ్రీరావి మోహనరావుగారి హృదయకేదారాన్ని కూడా ఈ తెలుగు జల్లులు ముద్దుముద్దుగా తడిపాయి. దాంతో ఈ గ్రంథం సర్వాంగసుందరంగా ఇలా అచ్చయింది. పుష్కలావర్తపయోదమై భాషాక్షేత్రాన్ని ఆవరించింది. అందుకు నైఋతీ ఋతుపవన పాత్రను పోషించిన మోహనరావు దంపతులు ధన్యులు. ఇక నాకు మడవలు, కాల్వలు తీసే భాగ్యం కల్పించిన ఈశ్వరునకు, మోహనరావు గారికి నా వెన్నెలకోలు.

**శునం వాహా శునం నరః శునం కృషతు లాంగలం**
**శునం వరత్రా బధ్యంతాం శునమష్ట్ర ముదిఙ్గయ (ఋగ్వేదము)**

ఎడ్లు సుఖముగా లాగుగాక, మనుష్యులు సుఖముగా పనిచేయుదురుగాక, నాగలి సుఖముగా దున్నుగాక. ములుకోల సుఖముగా తోలుగాక.

దుర్ముఖ – భాద్రపద – శుద్ధపాడ్యమి. **ఉన్నం జ్యోతివాసు**
2-9-2016.



శ్రీః

# సస్యానందము - తెనుగు తాత్పర్య సహితము

## ప్రథమాధికారము.

దేవతా ప్రార్థనా మంగళము.

క. శ్రీనగమందిరు గౌరీ । మానసపూజావలోక మహితాత్ముని ని
త్యానందమూర్తి శంకరు । నానత వాగీశు మల్లికార్జునుదలఁతున్ ॥ 1

**తా॥ శ్రీనగ ఇతి॥** శ్రీశైలమునందు నివసించువాడును, పార్వతీదేవి చేయునట్టి మానసిక పూజకు సంతోషమును పొందువాడును, సదా ఆనందస్వరూపుడును, బ్రహ్మదేవునిచేత పూజలందువాడును, సుఖము నిచ్చువాడును అగు శ్రీశైలమల్లికార్జునస్వామిని నేను అనఁగా (గ్రంథకర్త) మనస్సుచేత ధ్యానము చేయుచున్నాను అని తాత్పర్యము.

చ. దురితమహోల్క పెంపుడిపి దుఃఖదవానలమార్చి చక్ర వి
స్ఫురణతటిల్లతామహిమ [1]సొంపువహింప ననారతంబు నా
దరమున సింహశైలమున తద్దయు వేడ్కచరింపుచున్న సుం
దరజలదంబు ధాత్రికి సుధాంతకృపామృతవృష్టి జేయుతన్ ॥ 2

**తా॥ దురిత ఇతి॥** పాపములను గొప్ప గొప్ప కొరువులను అణుగద్రొక్కి, దుఃఖమనే

టటువంటి కాఱుచిచ్చునుచల్లార్చి, చక్రముయొక్క కాంతులనేటటువంటి మెఱుపులు మెఱయుచుండ సదాప్రీతితో సింహాచలమునందు గాపురమున్న సుందరేశ్వరుడనేటటువంటి మేఘము లోకమునకు కృపామృతవృష్టిని వర్షించునుగాక అని తాత్పర్యము.

**ఉ. శ్రీవనితేశు నాభి సరసీరుహ గర్భమునం జనించి వే**
**దావలి మోము దామర లుదంచిత సౌరభ లీలగ్రోల ధా**
**త్రీవిభవంబు భారతికి దివ్యమహత్వ మెలర్ప జేయు సం**
**భావిత సర్వలోక సుఖభావితు ధాత నుతింతు వేడుకన్ ॥ 3**

**తా॥ శ్రీ వనితేతి॥** శ్రీమన్నారాయణునియొక్క నాభికమలము నందుబుట్టి ముఖకమలముల నుండి వేదములు వెలువడుచుండ తనభార్య యగు సరస్వతీదేవికి భూమియందలి విశేషములను చెప్పుచున్నవాఁడును, సకల జనులకు సుఖముల గలుగజేయు కోరికగలవాడును అగు బ్రహ్మదేవుని వేడుకతో గొనియాడుదును అని తాత్పర్యము.

**క. బాలార్కతేజు నుజ్జ్వల । బాలోరగహారుమౌళి భాగ విరాజ**
**ద్బాల శశాంక విభూషణు । ఫాలాంబకు దంతవక్త్రు భక్తి భజింతున్ । 4**

**తా॥ బాలార్క ఇతి॥** బాలసూర్యుడువంటి తేజస్సుగలవాఁడును, చిన్ని పాముల హారముల ధరించినవాడును, శిరంబున బాలచంద్రుని ధరించినవాఁడును, నుదుట కన్ను గలవాడును, ఏనుగు ముఖముగల వాడునగు విఘ్నేశ్వరుని పూజింతును అని తాత్పర్యము.

**వ. ఇట్లు దేవతాప్రార్థనంబుజేసి యాత్మగతంబున, 5**

**తా॥ ఇట్లు ఇతి॥** ఈప్రకారము ఇష్టదేవతలను ప్రార్థించి తన మనస్సులో నిట్లు తలంచెను అని తాత్పర్యము.

## గ్రంథమహిమా వర్ణన ప్రయోజనంబులు

**ఆ.వె. వానచేత సస్యవర్గంబు వర్ధిల్లు । సస్యవృద్ధి సకల జనసమృద్ధి ।**
**కారణంబు దాన గావున ధరలోన । వాన వలయు నెల్లవారలకును ॥ 6**

**తా॥ వానచేత ఇతి॥** వానకురియుటచేత పైర్లుపెరుగును, పైర్లు పెరిగి పండిన జనులు అనుభవించి వృద్ధి పొందుదురు. కావున లోకములో అందఱికిని వానకావలసియే యున్నది అని తాత్పర్యము.

**కం. దానవ సుర ఖచరాదులు । గానరు మానినుల చిత్త గతియును ధరలో**
**వానల రాకయు బోకయు । మానవులది దెలియు టకట! మాన్యముగాదే ॥7**

**తా॥ దానవ ఇతి॥** స్త్రీలయొక్క మనస్సునుగాని, వానవచ్చుటను గాని, వాన రాకపోవుటనుగాని, దేవతలు రాక్షసులు యక్షులు మొదలైనవారెవ్వరును తెలిసికొనలేరు. అట్టి సందర్భమున మనుష్యులు వానయొక్క రాకపోకలను తెలిసికొన్న ఎక్కువ గౌరవముగదా అని.

## కృతికర్తవంశావతరణిక

**వ॥ అను లోకోక్తు లాకర్ణించి గార్గ్య, వరాహమిహిర, లల్లాది సంహితాసారంబులు గూర్చి ప్రవర్షవివర్షణంబులు జనులకు బోధసేయుటకునై సస్యానందంబుజెప్ప నుద్యోగించితిఁ గావున, నట్టి యస్మదీయాన్వయ ప్రకారం బెట్టిదనిన, 8**

**తా॥ అనులోక ఇతి॥** అను లోకోక్తిని విని గార్గ్యసంహిత, మిహిరసంహిత, వరాహసంహిత, లల్లసంహిత మొదలగుగాగల సంహితలలోని సారంబుల చక్కగా గ్రహించి వర్షమువచ్చుటకు లక్షణములును, రాకుండుటకు లక్షణములును జనులకు చక్కగా తెలియుట కొఱకు "**సస్యానందము**" అనుపేరుతో ఒకగ్రంథము వ్రాయబూనితిని. కావున ముందు నా వంశానుక్రమణికను చెప్పెదను అని తాత్పర్యము.

**క. వనజాసను మానసమున । జనియించి తపంబొనర్చి జలమధ్యములం**
**దును మునులాపస్తంబుం । దని కొనియాడంగ నిశ్చలాత్ముండగుచున్ ॥ 9**

**తా॥ వనజ ఇతి॥** సకలమునులును "**ఆపస్తంబుండు**" అని పొగడుచుండ బ్రహ్మదేవుని మానసమున బుట్టి నీళ్ళలోనుండి తపముచేసిన మహానుభావుఁడు ఒకఁడు ఉండెను అని తా.

**వ. అట్టి యాపస్తంబసూత్రంబున, 10**

**తా॥ అట్టి ఇతి॥** ఆ ఆపస్తంబుని సూత్రమునందు అని తా.

**క. వత్సలుఁ దనవద్యుఁడు ని । ర్మత్సరుఁడష్టాంగయోగ మహనీయుఁడు శ్రీ**
**వత్సాంకమూర్తియును శ్రీ । వత్సమునీంద్రాన్వయమున వైభవయుతుఁడున్ ॥11**

**తా॥ వత్సల ఇతి॥** శ్రీవత్సుండను మునీంద్రుడు ఒకఁడు కలడు. ఆముని వాత్సల్యముగలవాఁడును, గొప్పవాడును, క్రోధములేనివాడును, యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధ్యానము, ధారణము, సమాధి అను అష్టాంగములుగల యోగమునందు సమర్థుండును, శ్రీమహావిష్ణువువంటి సుందరమయిన దేహముగలవాడును, సంపన్నుండునై యుండెను అని తా.

**ఉ. ధీనిధి మాచిరాజునకు ధీర గుణాన్విత రుద్రమాంబ కున్**
**సూనుఁడ ధర్మతత్పరుఁడ సోమకళాధర పాదపంకజ**
**ధ్యానపరాయణుండ నయ తత్త్వవివేక విచారదక్షుఁడన్**
**[3]దోనయ నామధేయుఁడ విధూత కళంక పవిత్ర చిత్తుఁడన్ ॥ 12**

**తా॥ ధీనిధీ ఇతి॥** ఆశ్రీవత్సమునీంద్రుని వంశమునందు మాచిరాజు అను బుద్ధిమంతుడు జన్మించెను. అతని భార్య రుద్రమ్మ ధీరురాలు. ఆ దంపతుల గర్భమునందు దోనయ్య అను బాపడు పుట్టెను. అతడు ధర్మమునందు ఆసక్తి గలవాడును, ఈశ్వరునియందు భక్తిగలవాడును, నీతిశాస్త్రమునందును తత్త్వశాస్త్రమునందును గొప్ప ప్రజ్ఞ గలవాడును, కళంకము లేనివాడును, పవిత్రుడును.

**క. జనియించి తల్లిదండ్రుల । కనకాచలవార్ధిచంద్ర కమలాప్తులతో**
**నెనయగు ధీరతతో తన । తనుకాంతి విరాజిత ప్రతాపములనిలన్ ॥ 13**

**తా॥ జనియించి ఇతి॥** ఆ దోనయ అను నేను మేరుపర్వతమువంటి ధైర్యమును, సముద్రమువంటి గాంభీర్యమును, చంద్రునివంటి దేహకాంతియును, సూర్యునివంటి ప్రతాపమును, గలవాడనై నా తల్లిదండ్రులను సంతోషము నొందించితిని అని తా.

**ఆ.వె. వసుధలోనఁబరమ వంశవిభూషణ । మైన న న్నుపేంద్రుఁడాదరింప**
**[2]శ్రీకరముగ సర్వలోకాశ్రయముఁజెప్పి । మిన్నుముట్ట కీర్తిగన్నవాఁడ ॥ 14**

**తా॥ వసుధ ఇతి॥** వంశమునకు వన్నెదెచ్చునటువంటివాడనయిన నేను ఉపేంద్ర చక్రవర్తి అనుగ్రహమువలన 'సర్వలోకాశ్రయము' అను గ్రంథమును రచియించి లోకమునందు ప్రసిద్ధమైన కీర్తిని పొందితిని అని తా.

**క. సదమల వాక్యస్ఫురణయు । పదలాలిత్యంబు జూపి ప్రాజ్ఞులు మెచ్చన్**
**ముదమున సస్యానందము । వదలక రచియింతు విబుధవర్గము మెచ్చన్ ॥15**

**తా॥ సదమల ఇతి॥** లలితములు అయిన పదములును, మంచి మంచి వాక్యములును, గలిగి చక్కగా తెలియును అని పండితులు మెచ్చుకొనులాగున సులభశైలితో ఇప్పుడు "సస్యానందము" అను ఈ పుస్తకమును రచియింతును అని గ్రంథకర్త తన వంశక్రమమును తాను ఇంతకుముందు చెప్పియున్న గ్రంథమును, ఇప్పుడు చెప్పబోవు గ్రంథమును గూర్చియు వివరించెను అని తా.

## మేఘనిర్ణయము

**సీ. వసుసంఖ్య బెంచిన వర శకాబ్దంబులు తెరగొప్ప నటతొమ్మిదింటపాలు**
**బుచ్చినశేషంబు బొలుచునావర్తంబు 1 భూరిసంవర్తంబు 2 బుష్కరంబు 3**

**కమనీయద్రోణంబు 4 కాలమేఘంబును 5 నీలాలు 6 వారు 7 గౌనీ 8 తమంబు 9 లను నామములుగల్గు నభ్రంబులగువాని గర్భధారణముల గర్భపాత.**

**తే.గీ. కారణంబులుపరిపక్వ కాలఫలము । దెలసి వర్షంబు జెప్పక తెంపుచేసి**
**నోరగొలఁదులఁజెప్పెడి వారుసభల । సాపహాసంబుఁబొందుట సందియంబె ॥16**

**తా॥ వసుసంఖ్య ఇతి॥** శాలివాహన శకసంవత్సరములను ఎనిమిదింటిచేత (8) పెంచి అట్లు పెంచగా వచ్చిన మొత్తమును తొమ్మిదింటిచేత (9) భాగింపవలయును. అట్లు భాగింపగా మిగిలిన శేషము ఒకటియైనట్టయిన ఆ సంవత్సరము ఆవర్తమేఘము అనియును, రెండు శేషము వచ్చినట్టయిన సంవర్తమేఘము అనియును, మూఁడు శేషము వచ్చినట్టయిన పుష్కరమేఘము అనియును, నాలుగు శేషమువచ్చినట్టయిన ద్రోణ మేఘము అనియును, అయిదు శేషమువచ్చినట్టయిన కాలమేఘము అనియును, ఆఱు శేషము వచ్చినట్టయిన నీలమేఘము అనియును, ఏడు శేషమువచ్చినట్టయిన కారుమేఘము అనియును, ఎనిమిది శేషమువచ్చినట్టయిన గౌనీ మేఘము అనియును, శేషము రాకుండిన తమము అను మేఘము అనియును మేఘమును కనిపెట్టవలయును. అనంతరము ఆ మేఘములయొక్క గర్భధారణములును, గర్భపాతమునకు గారణములను, గర్భపరిపక్వ కారణములను, గర్భముఫలించు కారణములును, చక్కగా తెలిసికొని వర్షము కురియుట యును, కురవక పోవుటయును చెప్పవలయునేకాని నోటికి వచ్చినట్లు తెంపుచేసి చెప్పిన వర్షము కురియునా? కురవదు అనిభావము. అదియునుంగాక అట్లు లక్షణము తెలియక చెప్పునట్టివారు సభలలో అవమానమును పొందుదురుకాని గౌరవమును పొందరు అనియును భావము.

## ధాతు ప్రకారము

**క. ఘనతర శీతోష్ణంబులు । వినుత తుషా రానిలాభ్ర విద్యుద్వృష్టి**
**స్తనితేషానిర్ఝరవర । ధనువులు ధరలోన ధాతు దశకంబయ్యెన్ ॥ 17**

**తా॥ ఘనతర ఇతి॥** మంచియెండయును, మంచి శీతమును, మంచి మంచును, మంచి వాయువును, మేఘమును, మెఱుపును, వానయును, ఉరుమును, పరివేషమును (సూర్యునకు గాని చంద్రునకు గాని చుట్టూర చక్రములాగున గూడుకట్టుటకు పరివేషము అనిపేరు) ఇంద్ర ధనుస్సు అను ధాతువులు పది (10) గలవు అని తా.

**క. ఎసగఁగ వానయు నెండయుఁ । బ్రసరించిన మొగులు నుఱుము పటుతర విద్యు**
**ద్విసరము పరివేషంబును । వసుమతిలో ముఖ్యధాతు వర్గములయ్యెన్ ॥18**

**తా॥ ఎసగ ఇతి॥** ఈపది ధాతువులలో వాన (1), ఎండ (2) నలువైపుల వ్యాపించిన మబ్బు (3), ఉరుము (4), మంచి మెఱుము (5), పరివేషము (6) అను ఈ ఆఱు ధాతువులును ముఖ్యములైనవి అని.

**ఆ.వె. గర్భఋతువులందు కమనీయధాతువు । వర్గమందునేది వరుసగల్గి**
**చూలుమొలుచు మేఘజాలంబు నభమున । చిన్మయప్రకాశ! శ్రీగిరీశ! ॥19**

**తా॥ గర్భఋతు ఇతి॥** ఓ శ్రీశైలమల్లికార్జునస్వామీ! గర్భ ఋతువులలోగాని ధాతువర్గములోగాని దేనియందు క్రమముగా గర్భము నిలిచి ఆకాశమునందు మేఘము ప్రకాశించును అనియడిగిన జెప్పెదను వినుము. అని తా.

## గర్భ కాలము

**ఆ.వె. ఎసఁగ తిగ్మరోచి రసములు గైకొను । కాలమవని గర్భకాలమయ్యె**
**అవియె మగుడ నిచ్చు నవ్వేళ ధరణిని । ఘన ప్రసూతి కాలమనిరి జనులు॥20**

**తా॥ ఎసగ ఇతి॥** సూర్యుడు వేడియగు తన కిరణముల భూమియందు వ్యాపింప జేసి భూమియందున్న జలమును ఆవిరి రూపమున పైకితీసికొనుకాలమునకు గర్భకాలము అనిపేరు. ఆవిరిరూపముగ గ్రహించిన నీటిని మఱల వర్షరూపముగ నిచ్చు కాలమునకు ప్రసవ కాలము అని పెద్దలు పేరు పెట్టిరి అని తా.

**క. దివి మేఘంబులు గర్భం । బవిరతముగ నెపుడు బొల్చునది యాదిగ ను**
**ద్భవ మందు నూటముప్పది । దివసంబుల మీఁద ధనువు దృగ్గోచరమై ॥21**

**తా॥ దివి ఇతి॥** గర్భము దాల్చిన దినము మొదలుకొని నూటముప్పది దినములయిన వెనుక ఇంద్రధనుస్సుతోగూడ మేఘములు ఆకాశమునందు పుట్టును అని తా.

**ఆ.వె. అంబుదములు గర్భమైన దినంబది । యాదిగాఁగ దేవతాగ్రగణ్య!**
**యెసఁగ నూటతొమ్మిదెసఁగు దినమ్మున । వానగురియు సస్యవర్గ మలర ॥22**

**తా॥ అంబుద ఇతి॥** దేవతలందఱిలో ముందుబూజింపఁబడునట్టి ఓయీశ్వరా! మేఘములు గర్భమును ధరించిన దినమునకు నూటతొమ్మిదవ దినమున సస్య సముదాయము సంతోషమునొందునట్లు వాన కురియును అని తా.

**క. జలధర గర్భము మేలుగఁ । గలిగిన యద్దినము మొదలుగా నెన్నఁగ ము**
**న్నెలలపయి నేడుదివసం । బుల పరివేషంబు దోచు పూర్ణానందా! ॥ 23**

**తా॥ జలధర ఇతి॥** పూర్ణుడవును ఆనందస్వరూపుడవును అగునట్టి ఓ యీశ్వరా!

మేఘము గర్భమును ధరించిన తొంబదియేడు దినములకు సరిగా పరివేషము పుట్టును అని తా.

**క. పుడమి సమస్తము దెలియఁగ । యడపక గర్భంబులైన యద్దినమునకుం**
**యడ చన్న నూటనలుబది।యేడగు దివసమున మేఘ మిల నుదయించున్ ॥24**

**తా॥ పుడమి ఇతి॥** మేఘములు గర్భమును దాల్చిన నూటనలుబది యేడవ దినమున భూమియంతయు కానరాకుండ మేఘము వర్షించును అని తా.

## వృశ్చికమాస గర్భము

**సీ. గ్రహరాజు వృశ్చిక రాశి కేతెంచుచో కమలారి గురుగూడి కర్కినున్న**
**సురమంత్రిభానుపై చూడ్కులు నిల్పిన వృషభస్థుడై రాజు విమలభూరి**
**పరివేషయుతుఁడైన బాపేతరులు సూర్యు నిరు గెలకులనుండ నెసగు సింహ**
**కుంభచాపంబుల గువలయ మిత్రుండు సుర మంత్రియును సోమసుతుఁడు నిల్వ.**

**ఆ.వె. గన్యసితజుఁడుండ గాదేని శశిభౌము । లర్ధిదశమరాశి నాశ్రయింప**
**పూర్ణచంద్రుఁడుండ పొలుపైన నయ్యేఁడు । గోరినట్లు వాన గురియు నవని॥ 25**

**తా॥ గ్రహరాజు ఇతి॥** సూర్యుడు వృశ్చికరాశికి వచ్చునప్పుడు చంద్రుడు గురువుతోగూడి కర్కటక రాశియం దున్నను, బృహస్పతి సూర్యుని జూచుచున్నను, చంద్రుడు వృషభరాశియందుండి శుద్ధమైన గొప్ప పరివేషముతో గూడియున్నప్పటికిని, శుభగ్రహములు సూర్యునకు రెండువైపుల నున్నప్పటికిని, అనగా తులా ధనూ రాసులయందున్నప్పటికిని, సింహమునందు జంద్రుడును, కుంభము నందు బృహస్పతియును, ధనూరాశియందు బుధుడును ఉన్నప్పటికిని కన్యారాశియందు శుక్రుడున్నప్పటికిని అట్లుకాకున్న, పూర్ణ చంద్రుడును అంగారకుడును పదియవరాశియందు ఉన్నప్పటికిని ఆ సంవత్సరము వానలు దేశమునందు సుభిక్షముగా కురియునని తా.

**క. హరిదశ్వుఁడు వృశ్చికమున । కరిఁగెడునెడ రెంటమూట నల నాల్గింటన్**
**దిరమై కవి బుధ గురు హిమ । కరులుండిన ధాత్రియెల్ల కడలం బండున్ ॥26**

**తా॥ హరిదశ్వ ఇతి ॥** వృశ్చికరాశియందు సూర్యుడు ఉండునపుడు, సూర్యుడు ఉండురాశికి రెండు మూడు నాల్గు రాసులతో అనగా ధనుస్సునందును, మకరమునందును, కుంభమునందును శుక్రుడు బుధుడు బృహస్పతి చంద్రుడు అను నీనాల్గు గ్రహములు ఉండినట్లయిన భూమి అంతట చక్కగా పండునని తాత్పర్యము.

**ఆ.వె. కమలహితుఁడు వృశ్చికము చొచ్చుచో నిప్పు । డెన్నబడినచోట నున్న శుభుల**
**నేచిక్రూరు లతని జూచిన నిల్చిన । వానగలుఁగ దంద్రు భాను నేత్ర ॥ 27**

**తా॥ కమలహితుడు ఇతి ॥** భాను నేత్రుడవగు ఓ యీశ్వరా! సూర్యుడు వృశ్చికరాశిని ప్రవేశించునప్పుడు పై పద్యమునందు జెప్పియున్న స్థానములయందు ధనుర్మకర కుంభరాసులయందు ఉన్నటువంటి శుభగ్రహములను బాధించి పాపగ్రహములు సూర్యుని చూచినప్పటికిని, సూర్యునితో నున్నప్పటికిని వానలు గురియవు అని తా.

**గీ. అర్కు డనురాధ మూలల కరుగునపుడు।వాన యొక్కింతయేనియు వసుధమీద**
**గలుగకుండిన వానలు గలుగదంద్రు।వాన పదునాల్గుదినములు వసుధ మీఁద॥28**

**తా॥ అర్కుడు ఇతి॥** సూర్యుడు అనూరాధలో ప్రవేశించునప్పుడుగాని, మూలా నక్షత్రములో ప్రవేశించునప్పుడుగాని, కొంచెమైనను వానపడకుండినట్లులైన ఆ కార్తె మొదలుకొని పదునాల్గు దినముల వఱకు భూమిపై వానయుండదు అని గ్రహింపవలయునని తా.

**క. వారిజమిత్రుడు జ్యేష్ఠకు । జేరెడునెడ మొగులు మించి చెచ్చెర దిశలన్ ।**
**దోరంబగుటయు నిచ్చిన । వారిదములు మగుడ నిచ్చు వర్షము గురియున్ ॥29**

**తా॥ వారిజ ఇతి ॥** సూర్యుడు జ్యేష్ఠానక్షత్రములో ప్రవేశించునపుడు మేఘములు దట్టముగా బట్టియుండినట్లయిన వర్షము కురియును అని తా.

**వ. ఇది వృశ్చికగర్భం బింక పూర్వాషాఢ గర్భంబెట్టిదనిన, 30**

**తా॥ ఇది ఇతి॥** ఇప్పుడు చెప్పబడినది వృశ్చికగర్భము. ఇక పూర్వాషాఢగర్భమును తెలియజెప్పెదను ఆలకింపుమని తా.

## పూర్వాషాఢ గర్భము

**క. దినపతి పూర్వాషాఢకు । జనుదెంచిన వేళయెఱిగి శాస్త్రవిధిజ్ఞుం ।**
**డనిశము దశధాతువులును । గనుఁగొని వ్రాయంగ నవియు గర్భము లయ్యెన్॥31**

**తా॥ దినపతి ఇతి॥** జ్యోతిశ్శాస్త్రముయొక్క విధులను చక్కగ తెలిసికొని పండితుడు సూర్యుడు పూర్వాషాఢలో ప్రవేశించునట్టి వేళను చక్కగా కనుక్కొని పిమ్మట వెనుక చెప్పియున్న పది ధాతువులను తెలిసికొనగా నవియన్నియును గర్భములు అగునని తా.

**క. ముదమునఁ బూర్వాషాఢకుఁ । బదునాలుగు దివసములును బ్రభవించిన చూ ।**
**లొదవినయడ యార్ద్రాదిగ । బదునాలుగు రుక్షములను బహువృష్టియగున్॥ 32**

**తా॥ ముదమున ఇతి॥** సూర్యుడు పూర్వాషాఢా నక్షత్రము నందు ఉండు పదునాల్గు దినములలో గర్భము కల్గిన ఆర్ద్రానక్షత్రము మొదలుకొని పదునాల్గుకార్తెలయందును అతివృష్టి కలుగును. అనగా సూర్యుడు పూర్వాషాఢ నక్షత్రమునందు ప్రవేశించిన మొదటిదినమున గర్భము అయినట్టయిన ఆరుద్ర కార్తె యంతయు అతివృష్టి అనియును, మూడవ దినమున గర్భమయిన పుష్యమికార్తెయంతయు అమితవర్షము కురియుననియును, ఈ ప్రకారముగానే తక్కిన దినములకును అని తెలిసికొనవలయునని తా.

**వ. ఇది పూర్వాషాఢ ఋతుప్రకారం బింక మార్గశిరమాస గర్భం బెట్టిదనిన,33**

**తా॥ ఇది ఇతి॥** ఇప్పుడు చెప్పినది పూర్వాషాఢ గర్భలక్షణము. ఇక మార్గశీర్ష మాస గర్భమును గూర్చి చెప్పెదను వినుమని తా.

## మార్గశీర్ష మాస గర్భము

**ఆ.వె. చెలువుమిగులు మార్గశిర శుద్ధ ప్రతిపద । నొండె దాని రాకనొండె మొగులు ।**
**బన్నెనేని జ్యేష్ఠ బహుళ పక్షంబున । వానగురియు సిద్ధ వటపురారీ॥ 34**

**తా॥ చెలువు ఇతి॥** ఓ సిద్ధవటేశ్వరా! మార్గశిర శుద్ధపాడ్యమియందుగాని, మార్గశిర శుద్ధ పూర్ణిమయందుగాని మేఘము పట్టెనేని జ్యేష్ఠ బహుళమునందు వానలు చక్కగా కురియునని తా.

**ఆ.వె. అందు ఘటికలందునట దోఁచు ధాతువు । లవలనార్ద్ర బూనుటాదిగాగ ।**
**బొదలి గురియువాన వదలక బదునాలు । గేసి ఘడియలందు భాసురముగ ॥35**

**తా॥ అందు ఇతి॥** ఆ మార్గశిర శుద్ధ పాడ్యమియందుగాని, పూర్ణిమయందుగాని, యేయే గడియల యందు ధాతువులు పుట్టుచున్నవో, వానిని అనుసరించి ఆరుద్ర కార్తె మొదలుకొని పదునాలుగేసి గడియలు మంచి వానలు కురియుచుండునని తా.

**ఆ.వె. అందు స్వాతినార్ద్ర నల శతభిషమునం । దవనివీధి ముఖ్య ధాతుచయము ।**
**నెరయ దోచెనేని కళకంఠ! మఖలోన । వానగురియు సస్యవర్గ మలర ॥36**

**తా॥ అందు స్వాతి ఇతి॥** మార్గశిరమునందు స్వాతియందుగాని, ఆరుద్ర యందుగాని, శతభిషమునందుగాని, వాన ఎండ మేఘము ఉరుము మెఱుము పరివేషము అను ఈ ముఖ్యధాతువులలో నెవ్విగాని ఆకాశమునందు గనుపించినట్టయిన సస్యసమృద్ధిగ వానలు కురియునని తా.

**వ. ఇది మార్గశిరమాసగర్భం బింక పుష్యమాసగర్భం బెట్టిదనిన, 37**

**తా॥ ఇది ఇతి॥** ఇప్పుడు చెప్పినది మార్గశిరమాస గర్భము. ఇక పుష్యమాస గర్భమును జెప్పెదను వినుమని తా.

## పుష్య మాస గర్భము

**ఉ. పెల్లగు పుష్యమాసమున బెంపగురోహిణి మంచుగప్పినం**
**దెల్లముగాను పున్నమ నుదీర్ణములైచను ముఖ్య ధాతువు**
**ల్వెల్లిగొనంగదోచు నట విస్ఫురణంబున నంబికామనో**
**వల్లభ! వృష్టిజేయు ననివారణ గర్కటమాసవేళలన్. 38**

**తా॥ పెల్లగు ఇతి॥** పార్వతీదేవి మనస్సును రంజింపజేయునట్టి మహేశ్వరా! పుష్యమాసమునందు రోహిణీ నక్షత్రమునాడు మంచు పట్టినప్పటికిని, పుష్యశుద్ధ పూర్ణిమనాడు పై పద్యము (36వ)లో జెప్పియున్న ముఖ్యధాతువులు కనుపించినప్పటికిని, కర్కటకమాసము నందు వర్షములు అమితముగా గురియునని తా.

**చ. పొలుపుగ పుష్యమాసమున పున్నమరాత్రి తుషార వృష్టి య**
**ట్టలముగ నాల్గుఝాముల గడంగి మహీస్థలి దొప్పదోగినం**
**గలుగు విశాలవృష్టి యెసగంగను గర్కటమాసమాదిగా**
**చెలువగు నాల్గుమాసముల సిద్ధము శ్రీగిరినాథ మేదినిన్ ॥ 39**

**తా॥ పొలుపు ఇతి॥** ఓ శ్రీశైలవాసా! పుష్య శుద్ధ పూర్ణిమనాటి రాత్రి నాల్గుజాములును తుషారవృష్టి (తుంపురు) పడుచుండి భూమియంతయు తడిసినట్టులైన కర్కటకమాసము మొదలుకొని నాల్గుమాసములు మంచి వానలు కురియును, అనగా మొదటిజామున తుంపురుపడిన కర్కటకమాసమునందును, రెండవజామున తుంపురు పడిన సింహమాసము నందును, మూడవయామమున తుంపురుపడినట్టులైన కన్యామాసమునందును, నాల్గవ యామమున తుంపురు పడిన తులామాసమునందును, మంచి వానలు కురియునని తా.

**ఆ.వె. పరఁగఁబుష్యశుద్ధ పౌర్ణమి మొదలుగా । వరుసగాఁగ నాల్గు వాసరములు ।**
**విపుల ధాతుచయము విశదంబులగునేని । కారులోన వరపు గానరాదు ॥40**

వరపు అనగా వడ్లకయ్యలకు చుట్టూవుండే కట్ట. కారు అనగా మొదలుకారు పండే దినములు – అనగా అల్పిశి, కార్తికి, నెలలు ॥

**తా॥ పరగ ఇతి॥** పుష్యశుద్ధ పూర్ణిమ మొదలుకొని వరుసగా నాల్గు దినములు

ధాతువులు చక్కగా కనుపించినట్టులయిన మొదటికారుపండునట్టి దినములలో అనగా తులావృశ్చికమాసములయందు వాన లేకుండదు, అనగా పైరులకు కావలసినంత వాన యుండునని తా.

**ఆ.వె. మదనమథన! పుష్యమాసంబులోపల । మూలదొలఁగి తూర్పుగాలివాన ।**
**దర్శతుదయుగాఁగ దట్టమైవీచిన । కారులోన వఱపు గానరాదు ॥ 41**

**తా॥ మదన ఇతి॥** మన్మథుని సంహరించిన ఓ యీశ్వరా! పుష్యమాసమునందు మూలానక్షత్రము మొదలుకొని అమావాస్య వఱకు తూర్పుగాలితో గూడ వాన దట్టముగా కురిసినట్టయిన మొదటికారు పంటకు సమృద్ధిగా వర్షము కురియునని తా.

**సీ. దైవజ్ఞు లాత్మమీఁదటి యేటవర్షంబు గొలఁదిని దెలియంగ గోరిరేని**
**పుష్యమాసంబున బున్నమ మునిమాపు దొరకొని [4]పలిమెడు దూదియుంచి**
**మడక లోపలఁ బెట్టి మఱుగేమియును లేని పొడవున [5]నిడి వేగు బోకదూది**
**పిడువంగ ధారయై బెరసిన నయ్యేట వాన కాలములోన వఱపులేదు.**

**ఆ.వె. యందులేక కొన్ని బిందువులగునేని । మధ్యవృష్టి దూదిమంచునీట ।**
**దోఁగదేని వానదోఁగదు మేదిని । చిన్మయ ప్రకాశ! శ్రీగిరీశ! ॥ 42**

**తా॥ దైవజ్ఞు ఇతి॥** చిద్రూపుడవగు నో సాంబశివా! వచ్చే సంవత్సరమునకు వర్షము ఉన్నదా? లేదా? ఎంతవానయున్నది అను సంగతి తెలుసుకొనగోరు జ్యోతిశ్శాస్త్రజ్ఞులు పుష్యశుద్ధపూర్ణిమనాటి ప్రదోష సమయమునందు మేడుదూది తెచ్చి మడక (నాగటి) లో పెట్టి బయలులోనుంచి దానికి అడ్డము ఏమియును లేకుండ ఉంచవలయును. మఱునాడు ఉదయమున ఆదూది పిడువవలయును. ఆపిండు దూదినుండి ధారగా నీళ్లు వచ్చినట్టు లయిన వచ్చే సంవత్సరము (మరుసటి యేడు) వానాకాలమునందు వానలు సమృద్ధిగా నుండును. వరపు ఉండదు. అట్లాధారగా పడక కొన్ని బిందువులు మాత్రమే ఆదూది నుండి పడినట్టులయిన మధ్యవృష్టి కలుగును అని యెఱుగవలయును. ఆ నాగటియందు ఉంచిన దూది మంచునీటితో తడియనట్టులయిన మఱుసటియేడు వానలు కురువవు అని తెలుసుకొనవలయును. ఇప్పుడు చెప్పినది పుష్యమాస గర్భము. ఇక మాఘ మాస గర్భమును చెప్పుచున్నాను వినుము.

## మాఘమాస గర్భము

**క. తోరంబై మాఘములోఁ । బారసిపాడ్యములయందుఁ బర్వోత్తరముల్ ।**
**చారుతర యిష్టముల హిమ । మారుతములు గలుఁగ జ్యేష్ఠమాసము వీచున్ ॥43**

**తా॥ తోరంబై ఇతి॥** మాఘమాసములో ద్వాదశియందును పాడ్యమియందును, పర్వో-త్తరములయందును, అనగా పర్వదినములయిన అష్టమి, చతుర్దశి, అమావాస్య, పూర్ణిమ వీనికి మరునాడు మంచును, గాలియును, ఉన్నట్టయిన జ్యేష్ఠమాసమునందు వాయువు వీచునని తా.

**సీ. హిమరోచి మాఘమాసములోన నాశ్లేష కరయుగ్మ జలవిశాఖల గణంగి
శతతార మొదలు రేవతితార యంత్యంబు గలవేళ నలువగం గాలియేని
యేపారు మునిమంచు యెందేని నొదవిన భాద్రపదమ్మున నభ్రనికర
మోరంత బ్రొద్దున నుడుగని వానల ధరణి దోఁగు ననిరి దైవవిదులు ॥**

**ఆ.వె. భూరిసత్కృపాంబు ధారాభివర్ధిత । భువనసస్య! సకల బుధనమస్య! ।
నిగమవనమృగేంద్ర! నిర్మల గుణసాంద్ర! । భక్తవనజ మిత్ర! ఫాలనేత్ర! ॥44**

**తా॥ హిమరోచి ఇతి॥** దయామయుడవు, బుధజనపూజ్యుఁడవును, వేదవేద్యుడవును, సత్వగుణ సంపన్నుడవును, భక్తజనపోషకుడవునగు ఓ సాంబమూర్తీ! మాఘమాసమునందు చంద్రుడు ఆశ్లేషయందుగాని, హస్తయందుగాని, పూర్వాషాఢయందుగాని, విశాఖయందు గాని, శతభిషమునందుగాని, పూర్వాభాద్రయందుగాని, ఉత్తరాభాద్రయందుగాని, రేవతి యందుగాని ఉండునపుడు గాలివీచినప్పటికిని, మునిమంచు పట్టినప్పటికిని, భాద్రపదమాస మంతయు ఎడతెరపిలేకుండ వర్షములు కురియునని దైవజ్ఞులు చెప్పుదురని తా.

**క. ఆరయ మాఘపుపున్నమ । గూరిన మఖలోన మేఘకోటులు దరుచై ।
భూరితర వృష్టిదోచిన । ధారుణికి న్కరువులేదు తరుణేందుధరా ॥ 45**

**తా॥ ఆరయ ఇతి॥** తరుణ చంద్రుని ధరించిన ఓ యీశ్వరా! మాఘశుద్ధ పూర్ణిమనాటి మఘానక్షత్రమునందు విస్తారముగామబ్బుపట్టి గొప్ప వాన కురిసినట్టులయిన ఆసంవత్సరము భూమిలో కరువు ఉండదని తా.

**ఆ.వె. తనరు మాఘమాసమున శుద్ధసప్తమి । పరిధిలోన శీత భానుదుండ ।
శ్రావణమున శుద్ధ సప్తమిలోపల । వానగురియు సిద్ధవటపురారి! ॥ 46**

**తా॥ తనరు ఇతి ॥** ఓ సిద్ధవటేశ్వరా! మాఘశుద్ధ సప్తమినాడు చంద్రునికి చుట్టు పరివేషము వేసినట్టయిన అనగా గూడు కట్టినట్టయిన శ్రావణశుద్ధసప్తమిలోపల తప్పక వాన కురియునని తా.

**వ॥ ఇది మాఘమాస గర్భం బింక ఫాల్గుణమాస గర్భం బెట్టిదనిన॥ 47**

**తా॥ ఇది ఇతి॥** ఇప్పుడు చెప్పినది మాఘమాసగర్భము. ఇక ఫాల్గుణమాసగర్భమును చెప్పుచున్నాను వినుమని తా.

## ఫాల్గుణమాస గర్భము

క. **ముదమున గన్యయు మూలయు । వదలక యాద్యంతమైన వరతారలలో ।**
**పొదలుచు దశధాతువులును । గడిసినయెడ ఫాల్గుణంబు గర్భము దాల్చున్ ॥48**

**తా॥ ముదమున ఇతి॥** ఫాల్గుణమాసమందు ఉత్తర మొదలుకొని మూల తుదవఱకుగల నక్షత్రములలో ఏనక్షత్రమునందుగాని, దశధాతువులుగాని, అందులో కొన్ని ధాతువులుగాని కనుపించినయెడల ఫాల్గుణమాసగర్భమని తా.

క. **పొలసిన పర్వద్వయమున । నలకడ నాస్వాతితోడ నటమఘతోడన్ ।**
**గలయక ధాతుప్రకరము । గలిఁగిన నట ఫాల్గుణంబు గర్భము దాల్చున్ ॥49**

**తా॥ పొలసిన ఇతి॥** అదియునుగాక స్వాతీనక్షత్రముతోడగాని, మాఘానక్షత్రముతోడ గాని, చేరని పర్వములయిదింటిలో అనగా, అష్టమి, చతుర్దశి, పూర్ణిమ, అమావస్య, సూర్యసంక్రాంతి అనువానిలో ఏరెంటియందుగాని ధాతువులు కనుపించినట్టయిన ఫాల్గుణమాసగర్భమని తెలిసికొనవలయునని తా.

**మత్తకోకిల: సోముఁడాదట ఫాల్గుణంబున శుక్లపక్షములోన ను**
**ద్దామమండల సంవృతుండు నుదారకాంతి యుతుండునై**
**కోమలీ లలితాంగి రోహిణి గూడియుండగ నానెలన్**
**భూమికిం భయమందు తక్కిన భూరివృష్టి కరంబగున్ ॥ 50**

**తా॥ సోముఁడా ఇతి॥** ఫాల్గుణమాసము శుక్లపక్షమునందు చంద్రుడు రోహిణీ నక్షత్రముతో గూడియుండగా చంద్రునకు పరివేషము (గూడు) కట్టియుండినప్పుడు చంద్రుడు చక్కగా ప్రకాశించుచుండెనేని ఆనెలయందు అనగా మఱుసటియేటి ఫాల్గుణ మాసమునందు భూమికి దేనివలననైనగాని గొప్ప భయము కలుగును. అట్లు కలుగని పక్షమునందు అమితములగు వానలు ఫాల్గుణమాసములో కురియునని తా.

క. **వలగొని చినుకును గాలియు । నెలకొని యటఫాల్గుణంబు నెలలో గలుఁగన్ ।**
**గలుఁగును వానయు గాలియు । జలజాప్తుఁడు చిత్తగూడి చనుచున్న యెడన్॥51**

**తా॥ వలగొన ఇతి॥** ఫాల్గుణమాసమునందు గాలియును, చినుకులును, కలసియున్న

యెడల సూర్యుడు చిత్తానక్షత్రమును విడిచిపోవునపుడు అనగా తులామాసము మొదట పది దినములలో గాలివాన కొట్టునని తాత్ప.

**గద్య : ఇది సకల జన స్తుత్య దోనయామాత్య ప్రణీతంబైన**
**సస్యానందంబు నందు**
**ప్రథమాధికారము.**

ఇట్లు ప్రథమాధికారము ముగిసెను.



1. సొంపు వహింపగ నారతంబు (పూ.ము.పా.)
2. ప్రాకటముగ (పూ.ము.పా.)
3. గోనయ నామధేయుఁడ వికుంఠ చరిత్ర రసైకలోలుఁడన్ (పూ.ము.పా.)
4. పలిమేడు (పూ.ము.పా.)
5. వేగ బోగ (పూ.ము.పా.)

శ్రీరస్తు

# సస్యానందము - ద్వితీయాధికారము

## చైత్రమాస గర్భము

**ఉ. శ్రీనగధామ! చైత్రమున చెల్వగుపారశి చౌదశంబులన్ ।**
**మానుగ సంధ్యలన్ గగనమండలి యభ్రము లుద్భవించినన్ ।**
**వానలు గారులోగురియు వారక యందెఱనింగి దోచినన్ ।**
**వానలు లేకయుండు రిపువర్గభయం బగుచుండు మేదినిన్ ॥ 1**

**తా॥ శ్రీనగ ఇతి॥** శ్రీశైలనివాసా! చైత్రమాసములో ద్వాదశినాడు చతుర్దశినాడును సంధ్యాకాలములయందు ఆకాశమున మేఘముపట్టినట్టయిన ఆ సంవత్సరము తొలిపంటలు పండుసమయమునందు వానలు కావలసినంతమట్టుకు చక్కగా కురియును. ఆసంధ్యా కాలములయందు పట్టిన మేఘములు ఎఱ్ఱగా నుండినట్టయిన ఆసంవత్సరము వర్షములు ఉండవు. శత్రువుల వలన దేశమునకు భయము కూడా కలుగునని తా.

**తోటక వృత్తము:**

**పొలుపారఁగ చైత్రపుపున్నమలో । పల నొప్పగు నాలుగు వాసరముల్ ।**
**కలయ న్భువి వానలు గల్గిన న । వ్వలికారున వానలు నల్పమగున్ ॥2**

**తా॥ పొలుపారగ ఇతి॥** చైత్రశుద్ధపూర్ణిమకులోపల ఏ దినములలోగాని నాల్గుదినములు దేశమునందు వానలు కురిసినట్లయిన ఆ సంవత్సరము రెండవపంట పండునప్పుడు వానలు తక్కువగా కురియునని తాత్పర్యము.

## వైశాఖమాస గర్భము

**క. తొలుమేఘము వైశాఖము । నెల పడమట బొడమియెంత నేలయడదడపున్ ।**
**జలదోద్భవ రవమెంతట । నెలకొని వినుపించునంత నేలయు బండున్ ॥3**

**తా॥ తొలుమేఘము ఇతి ॥** వైశాఖ మాసమునందు ముందుగా పడమటివైపున మబ్బుపట్టి ఎంతనేల చినుకులుపడునో అంతభూమియును ఆ సంవత్సరము చక్కగా ఫలించును. మఱియును వైశాఖములో మబ్బుపట్టి యురుమగా ఆయురుము ఎంతవఱకు వినుపించునో అంత దేశము చక్కగా ఫలించునని తెలిసికొనవలయునని తాత్ప.

**ఆ.వె. వరద శ్రీగిరీశ! వైశాఖపున్నమ । తూర్పువలనబుట్టి తోరమైన ।**
**వారిదములు బన్ని వర్షించునంతయు । నేలయంతదవ్వు నెరయపండు ॥4**

**తా॥ వరద ఇతి॥** శ్రీశైలవాసుడవగునో వరదా! వైశాఖ శుద్ధ పూర్ణిమనాడు తూర్పుగా దట్టమైన మేఘములు పట్టి ఎంత దేశమువర్షించునో అంతభూమియును చక్కగా ఫలించునని తాత్ప.

**తరువోజ. మానుగవైశాఖ మాసంబు గృష్ణపాద్యమి యాదిగా బఱగెడి నాల్గు ।**
**దినములు బఱగు నాదినము నైపాఱ మహిమీద శ్రావణ మాసంబులాది ।**
**గా నాల్గునెలలకు గానయద్దివసముల గాలియును నెండ మొయిళులుగల్గ**
**నా నెల వఱపని రార్యజనములు సితపద్మసంకాశ! శ్రీగిరీశ! ॥ 5**

**తా॥ మానుగ ఇతి॥** వైశాఖ బహుళపాడ్యమి మొదలుకొని క్రమముగా నాల్గుదినములలో ఏదినముగాని గాలియు ఎండయు మెఱుములు కనుపించినట్లయిన శ్రావణము మొదలుకొని నాల్గుమాసములు భూమిపై వర్షము ఉండదు. అనగా శ్రావణ బహుళ పాడ్యమియందు గాలి మొదలగునవియున్న, శ్రావణమాసమునందును, విదియ యందున్న భాద్రపద మాసమునందును, తదియయందున్న ఆశ్వయుజమాసమునందును, చవితియందున్నట్లయిన కార్తీకమాసమునందును, వానలు ఉండవని తాత్ప.

**మానిని. పన్నుగ నామధుమాసమునం సితపంచమిఁ దూర్పును నుత్తరమున్ ।**
**పన్నినమేఘము కారుదినంబులు భాసురవృష్టికరంబగు నా ।**
**వెన్నఁగ పశ్చిమ దక్షిణ దిక్కులు వేమఱుగల్ల మెఱుంగులతో ।**
**బన్నిన నల్పఫలంబని జెప్పిరి భాసుర శ్రీగిరిధామ! శివా! ॥ 6**

**తా॥ పన్నుగ ఇతి॥** శ్రీశైలవాసుడవగు ఓ శివా! వైశాఖమాసములో శుద్ధ పంచమినాడు ఈశాన్యమూలగా పట్టినమేఘము మొదటిపంట పండుతరుణమునందు చక్కగా వర్షించి దేశము సుభిక్షముగానుండునట్లు చేయును. ఆనాడు నైఋతిమూలగ మేఘముపట్టెనేని వానలు లేవని ఎఱుగునది, ఆమేఘము పట్టినప్పుడు మెఱుపులుకూడ ఉండినట్లయిన కొంచెముగా వానకురియునని తెలుసుకొనవలయునని పెద్దలు చెప్పిరని తా.

**ఆ.వె. వఱలుతొలుతవాన వైశాఖమాసంబు । నందు శతవిశాఖ లందునుండి ।**
**తనర భరణి వాయు తారల యందేని । తడయనేలయెల్ల ధరణిబండు ॥ 7**

**వాయుతార యనగా - స్వాతీ నక్షత్రము.**

**తా॥ వఱలు ఇతి॥** వైశాఖమాసములో శతభిషా నక్షత్రమునందుగాని, విశాఖా

నక్షత్రమునందుగాని, భరణీ నక్షత్రమునందుగాని, స్వాతీనక్షత్రమునందుగాని, తొలివానలు గురిసినట్టయిన ఆ సంవత్సరము భూమి అంతయు సంపూర్ణముగా ఫలించునని తా.

**క. ఇనచంద్రులు రోహిణితో । నొనరిన వైశాఖమాసమున గూడిన య ।**
**ద్దినమున వానయు దోఁచిన । జనపదములు సకలసస్య సంపదబొల్చున్ ॥8**

**తా॥ ఇన ఇతి॥** వైశాఖమాసమునందు సూర్యుడును చంద్రుడును రోహిణీనక్షత్రముతో గూడియున్న దినమునందు వర్షమున్నట్టయిన దేశమంతయు పంటలు బాగుగా పండునని తా.

**మత్తకోకిల. మానితంబగుచున్న యమ్మధుమాసవేళలఁ గృత్తికన్ ।**
**బూనిరెండవ యంశభానుఁడు బొల్చునయ్యెడ చంద్రుఁడున్ ।**
**మానుగా కరివైరి జెందిన బస్తలోగురుఁడుండఁగా ।**
**వానలుంజెలువారు మేదిని వారిజారికళాధరా! ॥ 9**

**బస్తయనగా - మేషరాశి.**

**తా॥ మానితంబగు ఇతి॥** చంద్రకలాధరుడవగు నోశివా! వైశాఖమాసమునందు కృత్తిక రెండవపాదములో సూర్యుడు ప్రవేశించునప్పుడు చంద్రుడు సింహమునందును, గురువు మేషమునందును ఉండిరేని ఆసంవత్సరము వానలు చక్కగా కురిసి పంటలు బాగుగా పండునని తాత్ప.

**క. వెలయఁగ వృషభస్థుండగు । జలజాప్తుని రెండుదిశల శనికుజులుండన్ ।**
**పొలుపుగ గురుసౌమ్యుల లోపల నొక్కఁడు గూడియున్న బహువృష్టియగున్ ॥10**

**తా॥ వెలయగ ఇతి॥** సూర్యుడు వృషభరాశియందున్ననప్పుడు మేషమునందు శనియును, మిథునమునందు అంగారకుడును, ఉండగా గురుబుధులలో ఒకడు సూర్యునితో కలిసియుండెనేని ఆ సంవత్సరము అతివృష్టి కలుగునని తా.

**క. దిననాథుఁడు వృషభంబున । జనుచుండఁగ గురునితోడ చందురుఁ డలలో ।**
**చన శరభవనంబున ని । ల్చిన పంటలు మధ్యమగుట సిద్ధము ధరణిన్ ॥11**

**తా॥ దిననాథు ఇతి॥** సుర్యుడు వృషభములో ప్రవేశించినప్పుడు చంద్రుడు గురువుతో గూడుకొని కన్యారాశియందు ఉండునేని ఆ సంవత్సరము పంటలు మధ్యముగా పండును, అనగా చక్కగా పండవని తాత్పర్యము.

**చ. చెలువగుచున్న యట్టి మృగశీరుషమాదిగ మూడుదారలన్ ।**
**జలరుహమిత్రుఁడుండ విలసన్మధువేళ విధుండు దారికిన్ ।**

**దలకొని మూడునారునగు దారల నిల్వఁగ వానదోఁచు న।**
**య్యిలఁ దనరారు పంట లతడేనవతార జరింప కీడగున్ ॥ 12**

**తా॥ చెలువగు ఇతి॥** సూర్యుడు వృషభమునందు ఉండునపుడు అనగా వృషభ మాసమునందు చంద్రుడు మృగశిరయందును, ఆరుద్రయందును, పునర్వసుయందును, పుష్యమియందును, ఆశ్లేషయందును, మఘయందును, పుబ్బయందును, ఉత్తరయందును, ఉండునపుడు వానకురిసినట్లయిన ఆసంవత్సరము పంటలు చక్కగా పండును. చంద్రుడు హస్తయందును, చిత్తయందును, స్వాతియందును, ఉండగా వానకురిసినట్టయితే ఆయేడు పంటలకు నష్టము కలుగునని తెలుసుకొనవలయును. ఇప్పుడు చెప్పినది వైశాఖమాస గర్భము. ఇక జ్యేష్ఠమాసగర్భమును చెప్పుచున్నాను వినుము.

## జ్యేష్ఠమాస గర్భము

**ఆ.వె. ఏన్నఁడేని భానుఁడేపార రోహిణి। గూడియుండ శశిని గూడెనేని।**
**నింగినాఁటిమాపు నిర్మేఘమైయున్న। వానకొలఁది దెలియ వశముగాదు ॥13**

**తా॥ ఎన్నడేని ఇతి ॥** ఎప్పుడుగాని సూర్యుడు రోహిణీనక్షత్రమునందు చంద్రునితో గూడియుండగా ఆనాటిరాత్రి మేఘము పట్టక ఆకాశము శుద్ధముగానుండెనేని ఆ సంవత్సరము వర్షము ఇంత కురియునని చెప్పుటకు ఎవరితరమును కాదు. అనగా అమితమగు వర్షము కురియునని తాత్ప.

**క. తనరఁగ రోహిణితోడను। దిననాథుఁడు హిమకరుండు తెల్లంబుగ గూ।**
**డిన దినమున గాలియు హరి। ధనదులదిశ గల్గు సస్యతతి నలరించున్ ॥14**

**తా॥ తనరగ ఇతి॥** సూర్యుడును చంద్రుడును రోహిణీ నక్షత్రమునందు ఉండునాడు ఈశాన్యముగా గాలివీచెనేని పైర్లు అన్నియు చక్కగా ఫలియించునని తా.

**ఆ.వె. మదనమథన! జ్యేష్ఠ మాసంబులాగాలి। నిఋుతిమీఁద బుట్టి నిగుడెనేని।**
**వారుణంపు మొగులు వాయు పథంబున। గలిఁగెనేని వఱపుగలుఁగుమీఁద॥15**

**తా॥ మదన ఇతి॥ ఓ మదనాంతకా!** జ్యేష్ఠమాసమునందు నైఋుతిమూలగా మంచిగాలి వీచెనేనియును, ఆకాశమునందు లోకములను ముంచివేయునంతటి భయమును కలిగించునట్టి మేఘములు వ్యాపించియున్నప్పటికిని, ఆ సంవత్సరమునందు వానలు ఉండవని తా.

**సీ. ఏపార మఘతార లేనింటినడుమల నాలుగునోలి శ్రీనగనివేశ!।**
**ఉత్తరంబాదిగా నొగిజయపుష్కర వినుతాంబుఘనరజో వీథులనగ।**

**గొమరారు జ్యేష్ఠమాసము శుద్ధసప్తమి నబ్జారిజయపుష్కరాంబుమార్గ ।**
**ములజన్న సస్యసంపూర్ణమైమేదిని యనురాగమున బొందునవనిధూళి ॥**

**ఆ.వె. వీథిగూడిచన్న వేయేలనాయేఁట । పంటనమ్మికొలుచు బారజల్లు ।**
**నతఁడు బేలగాగ నాత్మలో దలపోయ । వలయునంద్రు మునులు వసుధలోన॥16**

**తా॥ ఏపార ఇతి॥** ఓ శ్రీశైలవాసా! ఉత్తర, హస్త, మఘ, పుబ్బ అను నీయైదు నక్షత్రములకును జయమార్గము, పుష్కరమార్గము, అంబుమార్గము, ఘనమార్గము, రజోమార్గము అని సంజ్ఞలు అని తెలుసుకొనవలయును. మఱియు జ్యేష్ఠ శుద్ధ సప్తమినాడు చంద్రుడు జయపుష్కరాంబుమార్గములలో అనగా ఉత్తర, హస్త, చిత్త అను నక్షత్రములలో ఏనక్షత్రమునందుగాని యున్నయెడల ఆ సంవత్సరము సస్యములు సంపూర్ణముగా ఫలించును. జనులు అన్యోన్యానురాగము గలిగి యుందురు. జ్యేష్ఠశుద్ధసప్తమినాడు చంద్రుడు ధూళిమార్గమునందు అనగా పుబ్బానక్షత్రమునందున్నట్టయిన ఆయేడు పంటలు పండనే పండవు. పంటలు పండును అనునట్టి ఆశతో విత్తనములు విత్తినవాడు మూఢుడని మునులు చెప్పియున్నారని తా.

**కవిరాజవిరాజితము:**

**చెలువగు నయ్యనురాధకు జ్యేష్ఠకుచిత్తకు చంద్రుఁడు చెంగటియై ।**
**పెలుచ నిదాఘమునం దొలుమాసము పెంపుగ దాపలయై చనఁగా ।**
**గలుఁగవు వానలు ధారుణిపైనని గర్గవరాహులు [2]గాద్పుడి నా ।**
**కులమున జెప్పిరి లోకహితంబుగ గోరిక శ్రీగిరినాథ శివా! ॥ 17**

**తా॥ చెలువగు ఇతి॥** శ్రీశైలవాసుడవగు శివా! ఏసంవత్సరమునందు చంద్రుడు అనూరాధకును, జ్యేష్ఠకును, చిత్తానక్షత్రమునకును చేరియుండగా గ్రీష్మఋతువుపోయి వర్షఋతువు వచ్చుచున్నదో ఆ సంవత్సరమున భూమియందు వానలు ఉండవని గర్గమహర్షియును, వరాహమిహిరుడును చెప్పియున్నారని తా.

**[5]తరువోజ: మానుగ జ్యేష్ఠమాసము పెంపులోన నుడుపతి యాషాఢ యుగముల నొండె ।**
**మానమైరోహిణి మధ్యంబునొండె జనజొచ్చి వెడలిన జలధార లవని ।**
**[8]మానిత గర్భసంపదపెంపు పెలుచ గాఁగ నవ్వని వానకాలంబులోన ।**
**వానలు లేవని వలను మీఱంగ మునుజెప్పె కైలాసమున నీశ్వరుండు ॥18**

**తా॥ మానుగా ఇతి॥** చంద్రుడు పూర్వాషాఢ, ఉత్తరాషాఢ అను నక్షత్రములలో దేనియందుగాని రోహిణీ నక్షత్రమునందుగాని యుండి వెడలుచుండునపుడు జ్యేష్ఠమాసము

ప్రారంభించినట్టయిన ఆసంవత్సరము వర్షము చక్కగా కురియును. ఆ సమయమునందు పైజెప్పిన జ్యేష్ఠశుద్ధపాడ్యమియందు గర్భసంపద అతిశయించి యున్నట్టయిన ఆ సంవత్సరము సకాలమునందు వానలుకురియవని తా.

**ఆ.వె. అరయ జ్యేష్ఠశుద్ధయష్టమి ఘడియలో।వానదోఁచునట్టి వసుధయెల్ల ।**
**నెరయ నీరు దోఁచు నింగిఘోషము విన్న।నవని యెల్ల బండు ననిరి మునులు॥19**

**తా॥ అరయ ఇతి॥** జ్యేష్ఠశుద్ధ అష్టమినాడు అష్టమి గడియలలో ఎంతభూమి వర్షముతో తడియునో అంతభూమియును ఆ సంవత్సరము అమితముగా వర్షము కురియుటచేత పంటలు బాగుగా పండక మురిగిపోవును. ఎంతభూమికి ఆనాడు ఉరుము వినిపించునో అంత భూమియును చక్కగా పండునని మునులు చెప్పియుండిరని తా.

**సీ. మహనీయమగు జ్యేష్ఠమాసంబుపెంపున పాడ్యమిమొదలుగా బరఁగుచుండు ।**
**వాసరంబులకారు మాసంబులకునోలి ధారుణిదినముపై దనరునండ్రు ।**
**అభ్రంబునిర్ఘోష మదర నుత్తరమున దూర్పుననుదయించి తొంగలించి ।**
**యనుగాలియద్దినంబున వీచ నన్నెల గురియువానలు సస్యకోటులలర ॥**

**ఆ.వె. దివుట బూర్ణిమాఖ్య దినమున జినికిన । మొనసిశ్రావణంబు మొదలుగాఁగ ।**
**నారు నెలల లోన నధికవర్షంబుచే । నిలసమృద్ధినొందు నీలకంఠ! ॥ 20**

**తా॥ మహనీయ ఇతి॥** ఓనీలకంఠా! జ్యేష్ఠశుద్ధపాడ్యమి మొదలుకొని దినము ఒకటింటికి ఒకనెలచొప్పున ఈక్రింద చెప్పునట్లు ఆరుమాసములు వర్షఫలము తెలిసికొనవలయును. ఆశుద్ధపాడ్యమినాడు మబ్బుపట్టి ఉరిమినట్టయినను, ఈశాన్యమూలగా గాలివీచినను, శ్రావణమాసమునందు మంచివానలుకురిసి భూమిచక్కగా ఫలించును, విదియనాడు మబ్బు పట్టి యురిమినను, ఈశాన్యమూలగా గాలివీచినను భాద్రపదమాసమునందు మంచివానలు కురియును. తదియనాడు అట్లే ఉరిమినను గాలివీచినను ఆశ్వయుజమాసమున వానలు కురియును, చవితియందు ఉరిమినను గాలివీచినను కార్తీకమాసమునవానలు కురియును. పంచమియందు అట్టే ఉన్నట్టయిన మార్గశిరమాసమునందు వర్షము కురియును. షష్ఠియందు ఉరిమినను, ఈశాన్యపుగాలి వీచినను పుష్యమాసమునందు వానలు కురియును. ఇట్లే మరల ఆరుదినములకు ఈ పైన చెప్పిన యారుమాసములకును వర్షఫలమును చెప్పవలయును. జ్యేష్ఠశుద్ధ పూర్ణిమనాడు వానకురిసినట్టయిన శ్రావణ మాసము మొదలుకొని ఆరుమాసములు మంచివానలు కురియును. పంటలన్నియును చక్కగా పండునని తాత్ప.

**ఆ.వె. తనరు జ్యేష్ఠమాసమున చిత్తయాదిగా । మూడుతారలందు బోడిగాగ ।**
**నింగి శ్రీగిరీశ నిర్మేఘమైయున్న । శ్రావణమునవృష్టి సంభవించు ॥ 21**

**తా॥ తనరు ఇతి ॥** ఓ నీలకంఠా! జ్యేష్ఠమాసమునందు చిత్త, స్వాతి, విశాఖ అను ఈమూడు నక్షత్రములయందును ఆకాశమునందు మబ్బు వేయక శుద్ధముగా నున్నట్టయిన శ్రావణ మాసమునందు వానవచ్చునని తాత్ప.

**వ. ఇది జ్యేష్ఠమాస గర్భలక్షణం బింక ద్రోణప్రకారం బెట్టిదనిన॥ 22**

**తా॥ ఇది ఇతి॥** ఇప్పుడు చెప్పినది జ్యేష్ఠమాస గర్భలక్షణము. ఇక ద్రోణప్రకారమును చెప్పుచున్నాను వినుము.

## ద్రోణ ప్రకారము

**ఆ.వె. చేరి తొలుతవాన జ్యేష్ఠమాసంబున । వఱలు నపరపక్షవాసరములు ।**
**గురియునాటతార గొమరారు ద్రోణంబు।నెఱుకపఱతు లోకహితము గాఁగ ॥23**

**తా॥ చేరి ఇతి॥** జ్యేష్ఠమాసమున కృష్ణపక్షమునందు ఏయేనక్షత్రమున వాన ఎంత కురియునో, ఆవిషయమును ద్రోణముల ప్రకారమును లోకహితముకొఱకు తెలియజేయు చున్నాని తా.

**ఆ.వె. ధరణిలోన నాదితార లేనింటను । శ్రీనగేశ! తొలుత వానగురియు ।**
**నవని కారులోన నారేసిద్రోణంబు । లంబుదమున నించు ననిరి మునులు ॥24**

**తా॥ ధరణి ఇతి॥** ఓ శ్రీశైలవాసా! అశ్విని మొదలుకొని ఐదు నక్షత్రములలో ఏనక్షత్రమునందుగాని వానకురిసినట్లయిన మొదటిపంటకాలములో మేఘము ఆరేసి ద్రోణముల వానను ఇచ్చునని తా.

**క. తనరఁగ నాషాఢయుగం । బున శ్రవణమునందు దనరు బూర్వాభాద్రం ।**
**బున దొలువానలు గురిసిన । ఖనటంబులు ద్రోణసప్తకము నొసఁగు శివా! ॥25**

**తా॥ తనరగ ఇతి॥** ఓశివా! జ్యేష్ఠమాసములో పూర్వాషాఢ నక్షత్రమునందుగాని, ఉత్తరాషాఢనక్షత్రమునందుగాని, శ్రవణనక్షత్రమునందుగాని, పూర్వాభాద్ర నక్షత్రమునందు గాని, తొలకరివానలు ప్రారంభమయినట్లయిన ఆ సంవత్సరము మేఘములు ఏడు ద్రోణముల వానను ఇచ్చునని తా.

**క. నెలకొని ధర చిత్తమఖా । నిలమనగా తారలందు [1]నెరయఁగ తొలువా ।**
**నలు గురిసిన ఖనటమ్ములు । నిలలో ద్రోణములనొసఁగు నిండుదశకమున్ ॥26**

**అనిలమనగా - స్వాతీ నక్షత్రము.**

**తా॥ నెలకొని ఇతి ॥** జ్యేష్ఠమాసమున చిత్తానక్షత్రమునందుగాని, మఘానక్షత్రము నందుగాని, స్వాతీనక్షత్రమునందుగాని, తొలకరి వానలు ప్రారంభమయ్యేనేని ఆ సంవత్సరము మేఘములు పదిద్రోణముల వర్షమునిచ్చునని తా.

**క. ఉత్తర మరిపుష్యంబులు । చిత్తను హర దేవమాత జలమగుపుబ్బం ।**
**గ్రొత్తయగువాన గురిసిన । నుత్తమద్రోణైకవింశ నొసఁగు ఘనంబుల్ ॥27**

**హరమనగా – ఆర్ద్రా నక్షత్రము. దేవమాత అనగా పునర్వసు నక్షత్రము. జలమనగా పూర్వాషాఢా నక్షత్రము.**

**తా॥ ఉత్తర ఇతి॥** ఉత్తరనక్షత్రమునందును, పుష్యమినక్షత్రమునందును, చిత్తానక్షత్రము నందును, ఆరుద్రా నక్షత్రమునందును, పునర్వసు నక్షత్రమునందును, పూర్వాషాఢా నక్షత్రమునందును, పుబ్బ నక్షత్రమునందును, తొలకరివానలు ప్రారంభము అయ్యేనేని ఆసంవత్సరము మేఘములు ఇరువదియొక ద్రోణముల వాననిచ్చునని తా.

**క. వసుఋతు మనుదివసంబుల । వెసగిరి ద్రోణములనిచ్చు విమల ఋతుజ్ఞా ।**
**వసు వరుణేందు విశాఖల । వసుమతిపై తొలుత వరుసవానలు గురియున్ ॥28**

**ఇందువనగా మృగశిర – వసువనగా ధనిష్ట – వరుణమనగా శతభిషము.**

**తా॥ వసుఋతు ఇతి॥** కాలజ్ఞుడవగు ఓశివా! ధనిష్ఠతోగూడిన అష్టమియందును, శతభిషానక్షత్రముతోగూడిన షష్ఠియందును, మృగశిరానక్షత్రముతోగూడిన చతుర్దశి యందును, విశాఖానక్షత్రముతో గూడిన సప్తమియందును, తొలకరివానలు ప్రారంభమయి నట్టయిన ఆ సంవత్సరము మేఘములు ఏడు ద్రోణముల వర్షమును ఇచ్చునని తాత్పర్యము.

**ఆ.వె. అవనిలోనవెలయు ననురాధమూలాంత్య । భద్రలందునెరయ భౌషరుక్ష ।**
**దొలుతవానగురియ ద్రోణంబులినదిశ । శంభునేత్ర వార్ధిసంఖ్యలంద్రు ॥ 29**

**అంత్యమనగా రేవతి, భద్రమనగా పూర్వాభాద్ర.**

**తా॥ అవని ఇతి॥** అనూరాధా నక్షత్రమునందు తొలకరివానలు ప్రారంభించిన పండ్రెండు ద్రోణముల వానయును, మూలానక్షత్రమునందు ప్రారంభించినట్టయిన ఎనిమిది ద్రోణముల వర్షమును, రేవతీ నక్షత్రమునందు ప్రారంభమైన ఎనిమిది ద్రోణముల వానయును, పూర్వాభాద్రయందు తొలకరివానలు ప్రారంభించినట్టయిన రెండు ద్రోణముల వానయును, పుష్యమీనక్షత్రమునందు తొలకరివానలు ప్రారంభించినట్లయిన నాలుగు ద్రోణముల వానయును, ఆసంవత్సరమునందు కురియునని తెలిసికొనవలయునని తా.

**వ. ఇక ద్రోణ ప్రమాణం బెట్టిదనిన.** **30**

ఇక ద్రోణప్రమాణమును చెప్పుచున్నాను వినుము.

## ద్రోణ ప్రమాణము

**క. కొలువఁగ నరువదిమూడం ।గుళములు ముఖవృత్తమైన కలశము దైవ ।**
**జ్ఞులు బయలనిలిపి వర్షము । వెలిసిన నవి నలుతుమైన వెస ద్రోణమగున్ ॥31**

**తా॥ కొలువ ఇతి॥** అరువదిమూడంగుళముల ముఖవృత్తము గల కలశమును ఆరుబయలునందు వర్షము కురియునపుడు ఉంచవలయును. వర్షము వెలిసినపిమ్మట ఆనీటిని కొలిచినట్టయిన అది నాలుగు తూములు ఉండవలయును. అట్లు నాలుగు తూములున్న ద్రోణము వర్షము కురిసినదనియును, రెండు తూములున్న అరద్రోణము వర్షమనియును, ఇట్లే తెలిసికొనవలయునని జ్యోతిశ్శాస్త్రవేత్తలు ద్రోణప్రమాణమును చెప్పియున్నారని తా.

**వ. ఇంక చంద్రయోగం బెట్టిదనిన ॥** **32**

ఇక చంద్రయోగమును జెప్పుచున్నాను వినుము.

## చంద్రయోగము

**ఆ.వె. అమరగురునితోడ నబ్జారిజ్యేష్ఠమా । సమ్ములోన నొక్క భమ్ములోన ।**
**నుండవానగురియు నుర్వికినయ్యేఁడు । పార్వతీశ! యీతిబాధలేదు ॥ 33**

**తా॥ అమర ఇతి ॥** ఓ పార్వతీశ్వరుడా! ఏ సంవత్సరము జ్యేష్ఠమాసమున గురువును చంద్రుడును ఒకేనక్షత్రమునందు ఉందురో ఆ సంవత్సరము వర్షములు చక్కగా కురియును. పంటలు చక్కగా పండును. అతివృష్టిగాని అనావృష్టిగాని ఉండదని తా.

**క. దానవగురుఁడును శశియును । మానుగ నొక తారనుండ మహితోరంబై ।**
**వానలు గురిసిన సస్యవి ।తానములకు వఱపులేదు ధారుణిలోనన్ ॥ 34**

**తా॥ దానవ ఇతి ॥** శుక్రుడు చంద్రుడును ఒక నక్షత్రమునందు ఉండగా ఏయేడు వానకురియునో, ఆ సంవత్సరము అనావృష్టిదోషములేక పండలు చక్కగా పండునని తాత్ప.

**క. అంగారకుఁడును శనియును । సంగతులైయున్న తార చటులాభ్రంబుల్ ।**
**పొంగితొలువానగురిసిన । నంగారకమలమునేయు నమ్మహియెల్లన్ ॥ 35**

**తా॥ అంగారక ఇతి॥** అంగారకుడును, శనియును, ఏకనక్షత్రమునందు ఉండగా ఏ

సంవత్సరము తొలకరివాన గురియునో, ఆ సంవత్సరము ఆదేశమున బూడిదపండును. అనగా, వర్షములేక సస్యము మాడిపోవునని తాత్ప.

**ఆ.వె. బుధుఁడు చందురుండు బొలుపొందనొకతార । గూడియుండ వానగురిసెనేని ।**
**పిదపకారులోన పెనుగాలి గలదని । దెలియవలయు శాస్త్రదృష్టిజేసి ॥ 36**

**తా॥ బుధుడు ఇతి॥** బుధుడును చంద్రుడును ఏకనక్షత్రమునందు ఉండగా వర్షము కురిసినట్లయిన మొదటి పంట పండుకాలమున గాలి మెండుగా వీచునని తా.

**క. శనిచంద్రు లేకతారను । జనుచుండఁగ వానదొడఁగ దజ్జనపదముల్ ।**
**బొనుపడురాష్ట్ర భయంబొం । డెను వ్యాధిభయంబు బీడజేయుట యొండెన్ ॥37**

**తా॥ శని ఇతి॥** శనియును చంద్రుడును ఏకనక్షత్రము నందుండగా వానకురిసినట్లయిన ఎచ్చటెచ్చట ఆప్రకారము కురియునో అక్కడక్కడ రాజువలనగాని, వ్యాధులవలనగాని గ్రామములకు పీడకలుగునని తా.

**వ. ఇది చంద్రయోగము, ఇంక పక్షియోగం బెట్టిదనిన ॥ 38**

ఇప్పుడు చెప్పినదే చంద్రయోగము. ఇక పక్షియోగమును చెప్పుచున్నాను వినుము.

## ఫలపక్షి యోగము

**క. తనరు తొలువానకురిసిన । దిననాథుం దున్న యెడల దెల్లంబుగ నే ।**
**లిన గ్రహముబట్టి యేర్పడ । జనవందితబుధునకింత జనయననువగున్ ॥39**

**తా॥ తనరు ఇతి॥** సూర్యుడు ఏరాశియందుండగా తొలకరివానలు ప్రారంభించునో ఆరాశికి అధిపతియగు గ్రహమును అనుసరించి ఫలము ఆసంవత్సరమునకు చెప్పవలయును. మఱియు మిథునమాసమునందు సూర్యుడు బుధునితోడగూడిగాని చూడబడిగాని యుండగా తొలకరివాన గురిసెనేని ఆ సంవత్సరము అనుకూలముగా నుండదని తాత్పర్యము.

**క. రవియుప్పుఁ జంద్రుచప్పిడి । భువితనయుఁడు వఱ్ఱదనము బుధుఁడొగ రిల భా।**
**ర్గవుఁడామ్లరసము మధురము । దివిజేజ్యుఁడు రవిసుతుండు తిక్తము దెలియన్॥40**

**తా॥ రవి ఇతి॥** సూర్యుడు ఉప్పు అనియును, చంద్రుడు చప్పిడి అనియును, అంగారకుడు వఱ్ఱ (కారము) అనియును, బుధుడు వగరు అనియును, గురువు తీపు అనియును, శుక్రుడు పులుపు అనియును, శని చేదు అనియును క్రమముగా గ్రహములకుగల రుచులను తెలిసికొనవలయునని తా.

**సీ. తొలుతటివానలోఁ దోయంబులొగరైన వట్టైనయగునేని కొఱ్ఱచేలు ।**
**తిక్తంబు నువ్వులు బత్తియు గుసుమయు మధురంబులగునేని మద్దిగడలు ।**
**నెఱయ జప్పనయైన నింపుతో జొన్నలు చెలువొందు గోధమ చేలుబండు ।**
**కసరైన వఱిగయు గంటెయు బొడచామలాదిగఁ జేలు పెంపారునీరు ॥**

**ఆ.వె. పుల్లనయ్యేనేని పొల్లగు దఱుచుగ । నుప్పనైనఁ బంట చెప్పజూప ।**
**గలుగదంద్రు మునులు కల్యాణమయధామ! । చిన్మయప్రకాశ! శ్రీగిరీశ! ॥41**

**తా॥ తొలుత ఇతి॥** చిద్రూపుడవై వెలుగునట్టి ఓ శ్రీశైలవాసా! తొలకరివాననీరు వగరుగానున్నట్టయినను, వఱ్ఱ (కారము) గా ఉన్నట్టయినను కొఱ్ఱపైరు చక్కగా ఫలించును. చేదుగానున్నట్లయిన నువ్వులు చక్కగా పండును. తొలకరివాన నీరు తియ్యగా నున్నట్లయిన పత్తియును కుసుమపంటలు పండును. ఆనీరు చప్పగా నుండినట్లయిన మద్దిగడలు ఫలించును. తొలకరివాన నీరు కసరుగా నున్నయెడల జొన్నలును గోధుమలును చక్కగా ఫలించును. తొలకరి వాననీరు పుల్లగానుండినట్టులయిన వరిగెలు, సజ్జలు, చిట్టిచామలు మొదలుగాగల పైరులు చక్కగా ఫలించును. తొలకరివాననీరు ఉప్పగా నుండినట్లయిన ఆ సంవత్సరము పంటలు ఎక్కువగా తాలుకంకివేసిపోవును. అనగా పండినదని చెప్పుటకును చూపుటకును లేకపోవునని మునులు చెప్పిరని తాత్పర్యము.

**క. రేవతి యశ్విని భరణియు । భావింపఁగ నున్న తారబట్టుక మేఘ ।**
**స్రావము గల్గిన కాటుక । క్రోవులగతి నుండు సస్యకోటి ధరిత్రిన్ ॥ 42**

**తా॥ రేవతి ఇతి ॥** సూర్యుడు రేవతీ నక్షత్రమునందుగాని, అశ్విని నక్షత్రమునందుగాని, భరణీ నక్షత్రమునందుగాని, యుండగా మేఘముపట్టి స్రావము అయ్యేనేని అనగా విచ్చిపోయెనేని ఆ సంవత్సరము పైర్లు కాటుకపిట్టలవలె నల్లగానుండునని తా.

**ఆ.వె. కుసుమ ప్రత్తి నువ్వు కొలఁదులు నధికంబు । ఎండతేజముండ దంద్రువడు ।**
**పొల్లులయగుననిరి యెల్ల సస్యములిల । చిన్మయప్రకాశ! శ్రీగిరీశ! ॥ 43**

**తా॥ కుసుమ ఇతి॥** మఱియును ఆసంవత్సరమునందు కుసుమధాన్యము, ప్రత్తి, నువ్వులు, కొద్దిగా ఫలించును. ఎండవేంద్రము అధికముగా నుండదు. సకల సస్యముల ధాన్యము పొల్లగునని తాత్ప.

**వ. ఇది ఫలపక్షియోగం బింక నాషాఢమాస లక్షణం బెట్టిదనిన ॥ 44**

**తా॥ ఇది ఇతి॥** ఇప్పుడు చెప్పినది ఫలపక్షియోగము ఇక ఆషాఢమాస లక్షణమును చెప్పుచున్నాను వినుము.

## ఆషాఢ లక్షణము

క. **పొలుపగు నాషాఢంబున । దొలుపాడ్యమి మృగశిరంబుతో గూడి ఘనా ।**
**వలి యాకసమున బన్నిన । వెలయు ధరం బూర్వసస్య వితతులుతఱుచై ॥45**

**తా॥ పొలుప ఇతి ॥** ఏసంవత్సరము ఆషాఢ శుద్ధపాడ్యమి మృగశిరానక్షత్రముతో గూడియుండగా మేఘములు దట్టముగా పట్టునో ఆ సంవత్సరము తొలుకారు పంటలు సమృద్ధిగా పండునని తా.

ఆ.వె. **అమరగురుఁడు జెప్పె నాషాఢమాసంబు । పెంపుపాడ్యమందుఁ బెల్లురేఁగి ।**
**యస్తమానవేళ నభ్రంబుపడమర । బన్నెనేని నవనిబాయు కఱవు ॥ 46**

**తా॥ అమర ఇతి ॥** మఱియు నోయీశ్వరా! ఆషాఢశుద్ధపాడ్యమినాడు సూర్యుడు అస్తమించునట్టి సమయమునందు పడమటివైపున దట్టముగా మేఘము పట్టినట్టయిన ఆసంవత్సరము భూమియందు కఱవు ఉండనే యుండదని బృహస్పతి చెప్పెనని తా.

క. **ఆయేఁటం దొలునవమిని । బాయక యుడుగణములోన బదియేనింటన్ ।**
**బాయక యుడురాజుండిన । ధీయుతవర్షంబుగురియు దినగర్భమగున్ ॥47**

**తా॥ ఆయేట ఇతి ॥** ఏసంవత్సరము ఆషాఢ శుద్ధ నవమినాడు అశ్వినిమొదలుకొని స్వాతీ నక్షత్రములోపల ఏ నక్షత్రమునందుగాని చంద్రుడు ఉండగా వర్షము కురియునో ఆ సంవత్సరమునకు ఆదినము మేఘగర్భదినము. అనగా ఆ మేఘమువలన దేశము సుభిక్షముగానుండునని తాత్ప.

ఆ.వె. **అవలిదశమియందు నమరేంద్రవారుణ । వాయుదిశలబుట్టి వానగురియ ।**
**తడయ నేలబడిన ధాన్యబీజంబులు । పండుగాని యెండపాలుబడవు ॥48**

**తా॥ ఆవలి ఇతి॥** ఆషాఢ బహుళ దశమియందు తూర్పుదిక్కునందుగాని, పడమటిదిక్కునందుగాని, వాయవ్య మూలయందుగాని మేఘముపట్టి వర్షముకురిసెనేని ఎంతప్రదేశమునందు ఆవాన పడియుండునో అంత ప్రదేశమునందును పడినగింజ పండునేగాని వ్యర్థము కాదని తాత్పర్యము.

[7]మానిని. **తెల్లము నాలవమాసమునం దొలుతేరలు వానలు దీర్ఘములై ।**
**పెల్లుగఁజల్లగఁ దోఁగిననేలల బెంపగు సస్యవితానము శో ।**
**భిల్లఁగ నావలిపున్నమ సంధ్యలబేర్చి విభాకరరశ్ములు రా ।**
**జిల్లిన వృష్టిని జేయు ఘనావళిసిద్ధము శ్రీగిరినాథ! శివా! ॥ 49**

**తా॥ తెల్లము ఇతి॥** శ్రీశైలనివాసుండవగు నోశివా! ఆషాఢశుక్లపక్షమునందలి

దినములలో వానలు గురిసి ఆషాఢ శుద్ధపూర్ణిమనాడు బాగుగా ఎండవచ్చినట్టయిన ఆ సంవత్సరమునందు మేఘములు చక్కగా వర్షించును. భూమియందు సకల సస్యములును పూర్ణముగా ఫలించునని తా.

**వ. ఇది యాషాఢమాస లక్షణం బిక వాయుప్రకారం బెట్టిదనిన ॥ 50**

**తా॥ ఇది ఇతి॥** ఇప్పుడు చెప్పినది ఆషాఢమాస గర్భలక్షణము. ఇక వాయులక్షణమును చెప్పుచున్నాను వినుము.

## వాయు ప్రకారము

**ఆ.వె. వాయువశమునందు వరమేఘజాలంబు । గూడివచ్చి వాన గురయుటయును ।**
**విచ్చిపోవుటయును వేగమై ఘోషంబు । సేయుటయును ధరణి శ్రీగిరీశ! ॥51**

**తా॥ వాయు ఇతి ॥** శ్రీశైలనివాసా! వాయువశముననే మేఘము పట్టి వర్షము కురియును. వాయువశముననే మేఘములు విచ్చిపోయి వర్షము కురియకుండును. వాయువశముననే ఉఱుముగూడ కలుగును. అనగా సర్వమునకు వాయువే కారణము. కావున వాయులక్షణము తప్పక తెలియవలయునని తా.

**క. అమరఁగ నాషాఢపు పు । న్నమ పగలిటిజాములకును నాధులుదలఁపన్ ।**
**గ్రమముగ శ్రావణమాదిగ । గొమరారును నాల్గునెలలు గుసుమాస్త్రారీ! ॥52**

**తా॥ అమరగ ఇతి॥** ఓమన్మథాంతకా! ఆషాఢ పూర్ణిమ పగలు నాలుగు జాములకును క్రమముగా శ్రావణము, భాద్రపదము, ఆశ్వయుజము, కార్తీకము, అను నాలుగు మాసములును అధిపతులని తెలియవలయునని తా.

**క. ఏజాములోన వాయువు । లోజనమయి విసరుచుండు నుడుగక ధర పై ।**
**నాజామున నేలుడు నెల । రాజితమగువృష్టి సస్యరాజికి నొసఁగున్ ॥ 53**

**తా॥ ఏజాము ఇతి ॥** ఆషాఢ శుద్ధపున్నమనాడు మొదటిజామున గాలిపుట్టి వీచినట్టయిన శ్రావణమునందును, రెండవజామున గాలివీచినట్టయిన భాద్రపదమాసమునందును, మూడవజామున గాలివీచినట్టయిన ఆశ్వయుజమాసమునందును, నాలుగవజామున గాలి వీచినట్టయిన కార్తీకమాసమునందును పైరులు చక్కగా ఫలించుటకు దగినట్లు వర్షము కురియునని తా.

**వ. ఇది కారణంబుగ దైవజ్ఞుండు వాయుప్రకారం బెఱుంగగోరి॥ 54**

**తా॥ ఇది ఇతి ॥** ఈ కారణముచేత జోస్యులు వాయుప్రకారమును తెలిసికొనుటకు ఏమి చేయవలయునో చెప్పుచున్నాను వినుమని తాత్ప.

**క. తలివమ్ము ముతకనూలునఁ । జెలువారినలీల నాల్గుచేతులనిడుపున్ ।**
**నలిచేతెడు వెడలుపునయి । యలవడఁగావించి యుందు నందము గాగన్ ॥55**

**తా॥ తలివమ్ము ఇతి ॥** వాయుప్రకారమును తెలుసుకొనగోరిన జోస్యుడు దుప్పట్లునేయునట్టి ముతకనూలుతో ఎనిమిది మూరల పొడవును, రెండుమూరల వెడల్పును గల వస్త్రమును నేయించి యుంచుకొనవలయునని తా.

**వ. అది పతాకంబుగా నిర్మించి యిరువదినాలుగు హస్తంబుల నిడివియగు నిర్వక్రంబగు దండంబునంగట్టి యాషాఢపు పున్నమ ప్రభాతసమయంబున నాధ్వజంబెత్తించి చూచుచున్నయెడ ॥ 56**

**తా॥ అది ఇతి ॥** ఆవస్త్రమును పతాకము (జెండా) గా నేర్పఱచి నలుబది యెనిమిది మూరల పొడవుగలిగి వంకరలేని కఱ్ఱకుగట్టి ఆషాఢ శుద్ధపూర్ణిమ నాడు ప్రాతఃకాలమున నిలువబెట్టి ఆధ్వజమును జాగరూకతతో జూచుచుండవలయునని తా.

**సీ. పడగతూర్పునకేగఁ బంటలుఘనమగు వహ్నిపైకరిగిన వఱపు గలుగు ।**
**జముమీఁద రాక్షసేశ్వరుమీఁదఁ దూలిన ఘనవర్గములచాలు గ్రాలిపోవు ।**
**పడమటి పయిఁబాఱ బహువృష్టిగాడ్పులు ననిలునిదిశయైన యట్టిఫలము ।**
**నరవాహనునిమీఁద నడరినఫలవృష్టి మదనాంతకునిమీఁద మధ్యఫలము ॥**

**ఆ.వె. మాఱుదాఁకితాఁకి మలయుచుదిశలెల్లఁ । గలయఁదిరిగెనేని కారులోన ।**
**వానగలిగి యొండె పైరులచేనొండె – సస్యవితతిపొలియుఁ జంద్రమౌళి॥57**

**తా॥ పడగ ఇతి॥** ఓచంద్రమౌళీశ్వరా! ఆప్రకారము ధ్వజమును నిలువబెట్టి చూచుచుండగా ఆపతాకము తూర్పు వైపునకు గాలివల్ల పోయినట్టయిన పంటలు ఘనముగా బండును. ఆధ్వజము ఆగ్నేయదిశకు బోయిన వానలు కురియవు. దక్షిణపు దిక్కుగాగాని నిఋతిమూలగాగాని జెండాగుడ్డపోయినట్టయిన మేఘములుపట్టి విచ్చిపోవునుగాని వర్షము కురియదు. ఆ జెండాగుడ్డ పడమటిదిక్కునకుబోయినట్టయిన అతివృష్టియును, గాలియును కలుగును. వాయువ్యమూలగా నాజెండాగుడ్డపోయినట్టయిన అతివృష్టియును, అధికముగా గాలియు నుండును, ఉత్తరదిక్కుగా ఆధ్వజపతాకము పోయినట్టయిన పంటలు బాగుగా పండుటకు దగిన వర్షము కురియును. ఈశాన్యదిశగా పతాకము పోయెనేని పంటలు మధ్యరకముగా పండును. మాటిమాటికా ఆ జెండా కఱ్ఱకు కొటుకొనుచు, అన్నివైపుల

దిరుగుచు, మెలికలుగాపడుచునున్నట్టయిన పంటలు పండు సమయమునందు మంచి వానలు కురిసి పంటలు చెడిపోవును. అట్లు వానలు కురియనియెడల శత్రువులమూలముగా నైనను పంటలు పాడైపోవునని తా.

**క. పడగఁబ్రదక్షిణ వృత్తిగ । సుడిసిన దద్ధాత్రిలోన సులభములై మే ।**
**లదరు శుభంబులుఁ బంటలు । విడివడదది మగుడఁదిరుగ విపరీతమగున్॥58**

**తా॥ పడగ బ్రదక్షిణ ఇతి॥** ఓ చంద్రమౌళీ! ఆజెండాగుడ్డ ప్రదక్షిణముగ చుట్టుకొని పోయెనేని దేశమునందు పంటలు సులభముగా బండును. ఆనేక శుభములు కలుగును. ఆ చుట్టుకొని పోయిన జెండా గుడ్డ మఱల వెనుకకు తిరిగినట్లయిన అనగా పెనుచుకపోయిన పతాకము విచ్చినట్టయిన ఆదేశమునందు పంటలు పండవు. అశుభములు అనేకములు కలుగునని తా.

**ఆ.వె. ఉదయవేళలందు నుదయించుగాడ్పులు । పూర్వఫలముజేయఁ బుడమిలోన ।**
**నవనిరెండువేళ లందునుమధ్యమ । ఫలములంద్రుమునులు ఫాలనేత్ర! ॥59**

**తా॥ ఉదయ ఇతి॥** ఓఫాలనేత్రుడా! ఉదయమున వీచు గాడ్పుల వలన తొలకారు పంటలు చక్కగా ఫలించును. ఉదయమునందును, సాయంకాలమునందును అనగా రెండువేళలందును వీచునట్టి గాడ్పుల వలన పంటలు మధ్యరకముగా ఫలించునని మునులు చెప్పిరని తా.

**క. వనజారి మీనయుతుఁడయి । చనఁగా నాషాఢకృష్ణ సప్తమినైనన్ ।**
**ఘనతర పరివేషంబులు । గనుఁగొన నగునేని వానకాలము వీచున్ ॥ 60**

**తా॥ వనజారి ఇతి ॥** ఆషాఢశుద్ధ సప్తమియందు పూర్వాభాద్ర నాల్గవపాదముగాని, ఉత్తరాభాద్రగాని, రేవతిగాని అయియుండగా గొప్ప పరివేషము (గూడు) కట్టెనేని ఆసంవత్సరము వానలు గాలితో గూడ నుండునని తా.

**క. చపలత నాషాఢంబున । నపరాష్టమిఁ గాలిగలిగి యావలి నవమిన్ ।**
**గపటంబు లేక మెఱసిన । నపరిమితం బంద్రువాన నమ్మహియెల్లన్ ॥ 61**

**తా॥ చపలత ఇతి॥** ఆషాఢబహుళ అష్టమియందు గాలిమెండుగా వీచి బహుళనవమి నాడు చక్కగా మెఱసినట్టయిన ఆ సంవత్సరము దేశమంతట అపరిమితమైన వానలు గురియునని తా.

**క. శశిధరు నాషాఢంబున । నిశితంబగు దశమియందు నటరోహిణికిన్ ।**
**గృశుఁడయి తన్మధ్యంబున । విశదస్థితి నిలిచి సస్యవితతులఁ బ్రోచున్ ॥62**

**తా॥ శశిధరు ఇతి ॥** ఏ సంవత్సరము ఆషాఢబహుళ దశమినాడు రోహిణీనక్షత్రము వచ్చునో ఆసంవత్సరము పైరులు చక్కగా ఫలించునని తా.

**ఆ.వె. పొలుపు మిగుల నూలి పున్నమవోయిన । పాడ్యమందు చవితి పంచములను ।**
**షష్ఠినాఁడువాన చల్లిన నయ్యేఁడు । తలఁపుమిగులఁబండు ధరణియెల్ల ॥63**

**తా॥ పొలుపు ఇతి॥** ఆషాఢ బహుళ పాడ్యమియందును, చవితియందును, పంచమి యందును, షష్ఠియందును వానచల్లినట్టయిన అనగా తుంపురు పడినట్టయిన ఆసంవత్సరము కోరికకుమించి పంటలు ఫలించునని.

**ఆ.వె. ఎన్నఁడేని భానుఁ డేపార రోహిణిఁ । గూడి యుండ దశమి గూడెనేని ।**
**నింగినాఁటిరేపు నిర్మేఘమయియున్న । వాన కొలఁది దెలియ వశముగాదు ॥64**

**తా॥ ఎన్నడేని ఇతి॥** సూర్యుడు రోహిణీనక్షత్రమునందు ఉండగా దశమితిథి తటస్థించినపుడు ఆనాటి సాయంకాలము ఆకాశమునందు మేఘము పట్టక తెరపిగా నున్నట్టయిన ఆ సంవత్సరము కురియునట్టివానకు మితము లేదు. అనగా అమితమగు వర్షము కురియునని తా.

**క. తనరఁగ రోహిణి తోడను । దిననాథుఁడు హిమకరుండుఁ దెల్లంబుగఁ గూ ।**
**డిన దినము గాలి హరిహర । ధనదిశలఁ బుట్టి సస్యతతి నలరించున్ ॥65**

**తా॥ తనరగ ఇతి॥** సూర్యుఁడు రోహిణీ నక్షత్రము నందుండగా చంద్రుడును రోహిణీ నక్షత్రము నందుండునప్పుడు అనగా వృషభమాసమునందు రోహిణీనక్షత్రమునాడు తూర్పుదిక్కునుండిగాని, ఈశాన్యదిశనుండిగాని, ఉత్తరపుదిక్కునుండిగాని, వాయువు వీచినట్టయిన ఆయేడు పైర్లు చక్కగా వృద్ధినొందునని తా.

**చ. ఒనరఁగ భానుబింబ మొక యూష్మ తెఱంగున గోకిలంబు నే ।**
**పున [4]పసికూనయట్టిగతి బొల్పెసలారెడు నట్టి లాంఛనం ।**
**బున దివసంబు రోహిణిని బూర్ణశశాంకుఁడు నుష్ణరోచియున్ ।**
**దనరఁగ గూడియుండినను ధారుణి మృత్యుభయాకులంబగున్ ॥ 66**

**తా॥ ఒనరగ ఇతి ॥** వృషభమాసమునందు రోహిణీనక్షత్రమునాడు సూర్య బింబము నందు ఉబ్బలాగునను, కోకిలమువలెను, కూన (బిడ్డ)లాగునను కనుపించినట్టయిన ఆ సంవత్సరమునందు జనులు మృత్యుభయముచేత కలతనొందుదురని తా.

**గద్య. ఇది సకలజనస్తుత్య దోనయామాత్య ప్రణీతంబైన**
**సస్యానందంబునందు**
**ద్వితీయాధికారము.**

ఇట్లు ద్వితీయాధికారము ముగిసెను.



1. దారుణంపు (పూ.ము.పా.)
2. కదుమది (పూ.ము.పా.)
3. నెరనెరయగ (పూ.ము.పా.)
4. గడికున్న (పూ.ము.పా.)
5. అక్కర తరువోజ (పూ.ము.పా.)
6. మాలిని (పూ.ము.పా.)
7. మాలిని (పూ.ము.పా.)
8. భాసిల్ల (పూ.ము.పా.)

శ్రీరస్తు

# సస్యానందము - తృతీయాధికారము

## శ్రావణమాస గర్భము

**మత్తకోకిల. శీతభానుఁడు శ్రావణంబునఁ జిత్తఁగూడి చరింప న ।**
**త్యాతురంబగు వానియామము లన్నిఁటం గరమొప్పఁ గా**
**ధాతువర్గము దోఁచెనేని నుదాత్తవృష్టిని చేయు బ్ర ।**
**ఖ్యాతమై విలసిల్లు మైత్రభమాది నెన్మిది తారలన్ ॥**

**మైత్రభమనఁగా – అనూరాధ** **1**

**తా॥ శీతభాను ఇతి॥** శ్రావణమాసమునందు చంద్రుడు చిత్తానక్షత్రముతో గూడియున్నపుడు దశవిధములైన ధాతువులలో నెవ్విగాని కనుపించెనేని అనూరాధా నక్షత్రము మొదలుకొని శతభిషనక్షత్రమువఱకు ఎనిమిది నక్షత్రములయందును వర్షము మిక్కిలి చక్కగా గురియునని, తా.

**ఆ.వె. అందు నట్ల స్వాతి నవిదోఁచుధాతువు । లవల పూర్వభాద్ర యాది గాఁగఁ ।**
**దార లెనిమిదింటఁ దోరమై వానలు । గురియు నంద్రు మునులు ధరణి లోన ॥2**

**తా॥ అందనట్ల ఇతి ॥** చిత్తానక్షత్రముతోగూడిన శ్రావణమునందువలెనే శ్రావణ మాసములో చంద్రుడు స్వాతీనక్షత్రముతో గూడియుండగా దశవిధ ధాతువులలో నేవిగాని కనుపించెనేని పూర్వాభాద్రమొదలుకొని మృగశిరా నక్షత్రమువఱకు ఎనిమిది నక్షత్రముల యందు వాన సమృద్ధిగా కురియునని తా.

**క. శ్రావణ విశాఖ నెనిమిది । భావంబుల నయిన ధాతుపంక్తికి నట గౌ ।**
**రీవరరుద్రభ మాదిగ । భావింపఁగ నెనిమిదింట బహువృష్టియగున్ ॥**

**రుద్రభనక్షత్రము – ఆరుద్ర** **3**

**తా॥ శ్రావణ ఇతి ॥** శ్రావణమాసమునందు చంద్రుడు విశాఖా నక్షత్రముతో గూడి యుండగా ఎనిమిది జాములలోను ఏజామునందు ధాతువులు కనుపించునో ఆరుద్ర నక్షత్రము మొదలుకొని హస్తానక్షత్రమువఱకుగల ఎనిమిదినక్షత్రములలో క్రమముగా

ఆనక్షత్రమునందు మంచివానలు కురియునని మునులు చెప్పిరి. అనగా ఆనక్షత్రకాలమును ఎనిమిదిగా విభజించుకొని ఏభాగమునందు ధాతువులు కనుపించునో అక్కడ చెప్పియున్న నక్షత్రము లెనిమిదింటిలో అన్నవ నక్షత్రమునందు వర్షముకురియునని చెప్పవలయును. మొదటిరెండుపద్యములకును ఇట్లే చెప్పవలయునని తా.

**క. వెలయఁగ నీక్రియ మీఁదటి । నెలలం జంద్రాదియోగ నికరం బొదవన్ ।**
**దెలిసిమతి వానఁజెప్పక । పలుమాటలుబలికి హాస్యపద నిరతుఁడగున్ ॥4**

**తా॥ వెలయగ ఇతి ॥** ఈప్రకారముగానే భాద్రపదాదిమాసములయందును చంద్రాదియోగముల సముదాయము లభింపగా వానిని చక్కగా తెలిసికొని వర్షము కురియునని చెప్పక ఏదియైన నోటికి వచ్చినట్లు చెప్పినవాడు హాస్యాస్పదుడగును. అనగా చంద్రాది యోగసముదాయముల చక్కగా తెలిసికొనియే వర్షయోగమును చెప్పవలయునని తా.

**ఆ.వె. రెండు దశము లందు నిండువేడుక తోడ । నభ్రచయము గగనమాశ్రయించి ।**
**బలసెనేని నందు భావించెనేనియు । నవల వఱపు లేదటంద్రు మునులు ॥5**

**తా॥ రెండు ఇతి ॥** శ్రావణమాసములో శుద్ధ దశమియందును, బహుళ దశమి యందును ఆకాశమున మేఘములుపట్టి అంతకంతకు దట్టమై వర్షించినను ఆపిమ్మట వఱపుండదు. అనగా వర్షములు కురియవని.

**క. శ్రావణపు బుష్య చవితు ఘ । నావలిచేఁబేర్చి భూమి నవిరళధారల్ ।**
**గావింప సకలసస్య । శ్రీవిభవము లొసఁగు ననిరి సిద్ధాంతవిదుల్ ॥ 6**

**తా॥ శ్రావణపు ఇతి ॥** శ్రావణమాసములో పుష్యమీనక్షత్రముతో గూడిన చవితియందు ఆకాశమున మేఘములు వ్యాపించి దట్టముగా వర్షించినట్టయిన ఆసంవత్సరము సకలవిధములైన సస్యములు ఫలించునని సిద్ధాంతవేత్తలు చెప్పినారని తా.

**క. సరి దివసంబుల ధాతువు లరయఁగ దివిఁబన్నెనేని నది సప్తములం ।**
**బరివేషించిన శ్రావణిఁ । బరఁగిన గర్భంబువలన బహువృష్టియగున్ ॥ 7**

**తా॥ సరి ఇతి ॥** శ్రావణమాసములో సరిదివసములయందు అనగా రెండు, నాల్గు, ఆఱు, ఎనిమిది మొదలగు తిథులయందు దశవిధ ధాతువులలో నెవ్విగాని కనుపించిన్పటికిని, శ్రావణమాసములోని శుద్ధ సప్తమియందుగాని, బహుళసప్తమియందుగాని, పరివేషము అనగా గూడుకట్టినను శ్రావణగర్భమని పేరు. అట్టి గర్భమువలన అతివృష్టి కలుగునని తా.

**ఆ.వె. మొనసి కారు మొగులు మునుకొని యమవసఁ । బొరలి వానదోఁచు భూములందు।**
**సస్యవితతు లెల్ల సంపూర్ణఫలముల । నతిశయిల్లు దేవతాగ్రగణ్య ॥ 8**

**తా॥ మొనసి ఇతి ॥** సకల దేవతలలో నగ్రగణ్యుడవైన ఓ సాంబమూర్తీ! శ్రావణబహుళ అమావాస్యనాడు భూమియంతయు ముంచివేయునట్లు మేఘములుపట్టి ఏప్రదేశమునందు పొర్లిపోవునట్లు వర్షముకురియునో ఆప్రదేశమునందు సకలవిధములయిన సస్యములును సంపూర్ణముగా ఫలించునని తాత్ప.

**వ. ఇది శ్రావణమాసగర్భం బింకభాద్రపదగర్భం బెట్టిదనిన॥ 9**

**తా॥ ఇది ఇతి॥** ఇప్పుడు చెప్పినది శ్రావణమాసగర్భము. భాద్రపదమాసగర్భమును చెప్పుచున్నాను వినుము.

## భాద్రపద గర్భము

**సీ. భాసురంబుగ భాద్రపదశుద్ధపక్షంబు ప్రతిపదమొదలుగాఁ బరగియవల ।**
**వాయుదైవతమైన వరతురగంబుల నుఱుములు గాలియు నొసఁగెనేని ।**
**నటుగాక తక్కిన యత్తార తుదగాఁగ మూడుతారలయందు ముఖ్యధాతు ।**
**తోరంబులగునేని ధారుణిఁ గడువాన లధికంబులగునని రార్యజనులు ॥**

**ఆ.వె. దాని పున్నమందు దనరారు మేఘంబు । లతుల గర్జనంబు లగ్గలించి ।**
**విచ్చిపోయెనేని వేయేల నయ్యేఁడు । కారులోన వాన గలుగదంద్రు ॥ 10**

**తా॥ భాసురంబు ఇతి ॥** భాద్రపదశుద్ధ పాడ్యమిమొదలుకొని ఆమాసములో స్వాతీనక్షత్రము పర్యంతముగల కాలమునందు ఉరుములును, గాలియును కలిగినట్టయిన ఆసంవత్సరము వానలు మెండుగాకురియును. ఆప్రకారము లేకున్నను శ్రావణమున హస్త, చిత్త, స్వాతి అను మూడునక్షత్రులయందు ముఖ్యము అయిన ధాతువులో అనగా వానయును, ఎండయును, నలుదిశలకమ్మిన మేఘము, మంచి మెరుపు, ఉరుము, పరివేషము అను వానిలో నెవ్విగాని కనుపించెనేని ఆసంవత్సరము వానలు మెండుగా కురియును. భాద్రపద శుద్ధ పున్నమనాడు మబ్బుపట్టి ఉరుములు మెండయి వర్షింపక మబ్బువిచ్చిపోయి నట్టయిన ఆసంవత్సరము సస్యముల కేమాత్రము వర్షము ఉండదని తా.

**కవిరాజవిరాజితము :**

**అనయము భాద్రపదంబున బున్నమ యాదిగ నవ్వలి చీఁకటిలో ।**
**[1]గనుఁగొనఁగా మృగశీరుషమే తుదగాగల రిక్కల వారుణముల్ ।**

**మొనసిన భానుసుధాకర రిక్కల బొందిన తద్దివసంబున ద ।**
**ద్ఘనపటలంబులు వానలుజేసిన గామిత సస్యము ధన్యమగున్ ॥ 11**

**తా॥ అనయము ఇతి॥** భాద్రపదబహుళ పాడ్యమిమొదలుకొని మృగశిరానక్షత్రము వఱకుగల నక్షత్రములు ఎనిమిదింటిలో ఏనక్షత్రమునందుగాని మబ్బుపట్టినను, మృగశిరా నక్షత్రమునందుగాని, హస్తానక్షత్రమునందుగాని మేఘములుకమ్మి వర్షించినను ఆ సంవత్సరము పంటలు చక్కగా ఫలించునని తా.

**వ॥ ఇది భాద్రపదగర్భలక్షణం బింక నాశ్వయుజమాస లక్షణం బెట్టిదనిన॥ 12**

**తా॥ ఇది ఇతి॥** ఇప్పుడు చెప్పినది భాద్రపదమాస గర్భలక్షణము. ఇక ఆశ్వయుజ మాసగర్భలక్షణమును చెప్పుచున్నాను వినుము.

## ఆశ్వయుజమాస గర్భము

**సీ. ఉడుగణాధిపుఁ డాశ్వయుజ మాసమున శుద్ధ వాసరంబులలోన వాయుతార ।**
**నాదినాల్గింటను ననురక్తినిల్వంగ వరవృష్టియొండేని వాతమొండెఁ ।**
**గలిఁగిన కడవాన గల్గు సస్యములకుఁ గృష్ణత్రయోదశి వృష్టిహస్త ।**
**తారకంబాదిగా దట్టమై యేనింట గాలియుఁగలిఁగినఁ గలుఁగునెపుడు ॥**

**ఆ.వె. సకలసస్యవితతి సంపూర్ణఫలమగు । బ్రబలుననుచుఁ బలికి రార్యులెల్ల ।**
**శ్రీనగేంద్ర ధామ! చిద్వ్యోమపథసోమ! । భక్తవనజమిత్ర! ఫాలనేత్ర! ॥**

**వాయుతార - స్వాతి ॥ 13**

**తా॥ ఉడుగణ ఇతి ॥** శ్రీశైలవాసుదవగు నోసాంబమూర్తీ! ఆశ్వయుజమాసమునందు శుక్లపక్షదినములలో ఏదినములందుగాని చంద్రుడు స్వాతి, విశాఖ, అనూరాధ, జ్యేష్ఠ అను నీనాలుగు నక్షత్రములలో నుండగా మంచివానగాని, వాయువుగాని యున్నట్టయిన ఆపైన పైర్లకు వర్షము ఉండదు. ఆశ్వయుజబహుళ త్రయోదశియందు వర్షముకురిసి నట్టయిన హస్తయందును, చిత్తయందును, స్వాతియందును, విశాఖయందును, అనూరాధ యందును వర్షము కురియును, వాయువుగూడ వీచినను వీచును. ఒకవేళ వాయువు వీవకుండ వర్షముమాత్రము కురియును. సకలవిధములయిన సస్యములును సంపూర్ణముగా ఫలించును. ఈప్రకారము జ్యోతిశ్శాస్త్రవేత్తలగు పెద్దలు చెప్పిరని తా.

**క. హరిదశ్వుఁడు కరతారకు । నురువడిఁ జనుచోట వానలుడుగకయున్నన్ ।**
**గురుతరవృష్టిని జేయును । సురుచిరభోగేంద్రహార! సోమార్ధధరా! ॥**

**కరతార - హస్త ॥ 14**

**తా॥ హరిదశ్వ ఇతి ॥** సూర్యుడు హస్తానక్షత్రమునందు ఉన్నదినములలో వర్షములు తెరపిలేక కురిసినట్టయిన ఆసంవత్సరము శ్రేష్ఠతరములయిన వర్షములు ఉండునని తా.

**వ. ఇది యాశ్వయుజమాసగర్భంబిక గ్రహణోత్పాతలక్షణం బెట్టిదనిన ॥ 15**

**తా॥ ఇది ఇతి॥** ఇప్పుడు చెప్పినది ఆశ్వయుజమాస గర్భలక్షణము. ఇక గ్రహణోత్పాత లక్షణమును చెప్పుచున్నాను. వినుము.

## గ్రహణోత్పాతము

**ఆ.వె. మానుగాఁగరాహు మాహేంద్రవారణ । మండలములఁజేరి చండశీత ।**
**భానుబింబయుగము బట్టను బదియేను । వాసరముల ముసురు వసుధలోన॥**
**మహేంద్రమనగా – జ్యేష్ఠ, వారుణమనగా – శతభిష ॥ 16**

**తా॥ మానుగా ఇతి ॥** రాహువు జ్యేష్ఠానక్షత్రమునందుగాని, శతభిషనక్షత్రమునందుగాని, ఉండునపుడు రాహుగ్రస్తమైన సూర్యగ్రహణముగాని, చంద్రగ్రహణముగాని పట్టినట్టయిన ఆసంవత్సరము ఆదేశమునందు పదునైదుదినములు విడువకుండ ఒకటేముసురుపట్టునని తా.

**క. ఆతత భూకంపోల్కా । పాతనిశాజాత శక్రపటుకోదండ ।**
**ద్యోతిత ధూమధ్వజములు । భూతలమున కివియు దోషముల నొనరించున్ ॥17**

**తా॥ ఆతత ఇతి ॥** గొప్పభూకంపమువలనను, ఉల్కలు పడుటవలనను, రాత్రుల యందు ఇంద్రధనుస్సు కనుపించుటవలనను, తోకచుక్కలు పుట్టుటవలనను దేశమునకు కష్టములు వచ్చునని తా.

**వ॥ ఇద్దోషంబులెట్టివనిన ॥ 18**

**తా॥ ఇద్దోష ఇతి ॥** దేశమునకు గలుగు దోషములు (కష్టములు) ఎట్టివో చెప్పుచున్నాను వినుము.

**ఆ.వె. చిలుక యెలుక మిడుత చెడువాన వఱపుట । వైరినృపతివిడిసి వసుధఁగొనుట ।**
**యనఁగఁ బరఁగుచున్న యాఱును నీతులై । ధాన్యహానిజేయు ధాత్రిలోన॥19**

**తా॥ చిలుక ఇతి ॥** చిలుకపోటు (ఇది ఒకవిధమైన చిన్నిఱెక్కల పురుగు. ఇది ధాన్యమునకు చిన్నరంధ్రమువేసి లోనిబియ్యమును తినును.) (2) ఎలుకలదండు (ఇవి గుంపులు గుంపులుగా బయలుదేరి పైరుల నరికివేయును.) (3) మిడుతల దండు (ఇవి

కోట్లకొలది బయలుదేరి సూర్యరశ్మి భూమిపై పడకుండ మేఘములువలె నడ్డగించుచువచ్చి పైరులపైబడి ఒక మొక్కయైన లేకుండ పైర్లనన్నిటికితిని పాడుచేయును.) (4) అతివృష్టి, (5) అనావృష్టి, (6) శత్రువులు దండెత్తివచ్చి దేశమును తీసికొనుట. అను నీయాఱును ఈతిబాధలు. వీనివలన ధాన్యమునకు నష్టము కలుగునని తా.

**ఆ.వె. పర్వతిథులయందుఁ బక్షాంతతిథులందు । నయినవాసరముల నర్కుఁడరుగు ।**
**రాశిసంధులందు గ్రచ్చుఱవర్షంబు । గురియరాదటంద్రు ధరణిసురులు ॥20**

**తా॥ పర్వ ఇతి ॥** అమావాస్యకును పాడ్యమికిని సంధిసమయమునందును, రాత్రియును పగలు సమముగానుండు తిథియందును (విషువత్తిథియందును), పూర్ణిమయందును, అమావాస్య యందును, సూర్యుడొకరాశినివిడిచి మఱియొకరాశిని పోవునట్టి సంధికాలము నందును, (రాశిసంధియందును) వర్షము కురియుట మంచిదికాదని భూదేవులు చెప్పుదురని తా.

**ఆ.వె. మెట్టఁ గప్పలరవ మృగకోటినీటిలో । నిలువఁ జిఱుతమీను చెలఁగి దాఁట ।**
**నంబుజముల ధూళి నలతొండ పొరలిన । వానగురియు సస్యవర్గమరల ॥21**

**తా॥ మెట్ట ఇతి॥** మెట్టయందు కప్పలుకూసినను, జంతువులు నీళ్ళలోదిగి నిలిచి యున్నను, చిన్న చిన్న చేపలు ఎగిఱెగిరిపడుచున్నను, తామరలపుప్పొడియందు తొండ పొర్లాడినను సకల సస్యములు సంపూర్ణముగ ఫలించునట్లు వర్షము కురియునని తెలిసికొన వలయునని తా.

**క. నెట్టన భూనాగంబులు । మెట్టంబొరలాడెనేని మిన్నక పశువుల్ ।**
**బుట్టలమిట్టల నెక్కిన । దట్టంబగు వాన సస్యతతినలరించున్ ॥ 22**

**తా॥ నెట్టన ఇతి ॥** భూనాగములు మెట్టన విడువక పొర్లాడినప్పటికిని, కారణములేకయే పశువులు పుట్టలమీదగాని, ఎత్తగు ప్రదేశముగాని, ఎక్కినప్పటికిని, దట్టముగా వర్షములు కురియును. సస్యములు చక్కగా ఫలించునని తా.

**క. హరిదశ్వుని యిరుగెలఁకులఁ । బరువడిఁ బ్రతిసూర్యులైన బడమటిదిశలన్ ।**
**సురధనుఖండము దోఁచిన । బొరిపొరినదిగొఱియమంద బొరిగొనకున్నే॥23**

**తా॥ హరిదశ్వ ఇతి ॥** సూర్యునకు రెండువైపులను మఱియిద్దఱు సూర్యులున్నట్లు దోచినను, పడమటి దిక్కున ఇంద్రధనుస్సుయొక్క ఖండము (తునుక) కనుపించినను, తప్పక గొఱ్ఱెలమందలు నశించునని తాత్పర్యము. అనగా వర్షము మెండుగాగలిగిన గొఱ్ఱెలు చచ్చును. కావున గొఱ్ఱెలమందలు నశించునంతటి వర్షము కురియునని తా.

క. **తిరమయి గాడ్పునఁ బడమట । సురధనువులు దోఁచెనేని సుందరకేశా! ।**
**శరదభ్రోజ్జ్వలరుచి బు । ష్కరముం గనువట్టెనేని ఘనవృష్టియగున్ ॥ 24**

**తా॥ తిరమయి ఇతి ॥** సుందరకేశపాశములు గల ఓసాంబమూర్తీ! వాయువ్యమునను, పడమటను, ఇంద్రధనుస్సులు వేసినప్పటికిని, శరదృతువునందలి మేఘమువలె వెలిమబ్బు వేసినప్పటికిని, మంచి వర్షము కురియునని తా.

క. **భానుఁడు వొడువఁగ గ్రుంకఁగ । మానుగ మేఘంబు గప్పి మందద్యుతులన్ ।**
**బూనితటిల్లత బెరిఁగిన । వానలు గలవనెడు వెట్టివారున్గలరే ॥ 25**

**తా॥ భానుడు ఇతి ॥** సూర్యోదయము సమయమునను, సూర్యుడు అస్తమించు సమయమునను, మేఘముపట్టి కొద్దిపాటి మెఱుపు మెఱయుచున్నయెడల యెంత మాత్రముగాని వర్షము కురియనే కురియదని తా.

ఆ.వె. **ఊరికుక్కలెల్ల నోరంతప్రొద్దునఁ । గూడి సంధ్యలందు గూయవేని ।**
**గ్రామములకు భయము గావింపు చుండని । వానగురియుఁ జేల వాడు దీఱ॥26**

**తా॥ ఊరికుక్క ఇతి॥** గ్రామములలో సూర్యోదయమునకును, సూర్యాస్తమయమునకును కొంచెము ముందుగా కుక్కలు మొఱగకున్నయెడల గ్రామములకు భయము కలిగింపనిది యును, పైరులకు భంగములేనిదియును అగు వర్షము కురియునని తా.

సీ. **దర్పించి యూరిప్రాంత్యమున గోవర్గముల్ సెలఁగుచు గవనికి జేరెనేని ।**
**నతిసంభ్రమంబుగా నవనిబ్రోవులు గట్టి మొనసి చీమలుగ్రుడ్లు మోసెనేని ।**
**దిక్కులన్నియునిండ దివుటమై నడునింగి విద్యుల్లతలతోడ వెల్గెనేని ।**
**తూర్పున నుదయించి తోరంపుగాడ్పులు వేమాఱు ధరమీద విసరెనేని ॥**

ఆ.వె. **గగనమండలంబు కమనీయ గోమూత్ర । రుచుల నొప్పెనేని రూఢిగాగ ।**
**వాన గురియు నంద్రు వరశాస్త్రవేదులు । సితరుచి ప్రకాశ! శ్రీగిరీశ! ॥ 27**

**తా॥ దర్పించి ఇతి ॥** తెల్లని దేహకాంతిగల ఓసాంబమూర్తీ! గ్రామమునకు వెలుపల పొలములలో మేయుటకుగాని, యెందులకుగాని పోయియున్న గోవులు దర్పించి, తోకలెత్తుకొని చెవులు నిక్కబొడువ నంబారవములుసలుపుచు గ్రామములో బ్రవేశింప బోయినను, చీమలు సంతోషముతో ముక్కుల గ్రుడ్లు గఱచుకొని బారులుదీరి పోవుచున్నను, సకలదిశల వ్యాపించి మేఘములు నడినెత్తిన మెఱుములతో నున్నను, అనేక పర్యాయములు తూర్పువాయువులు భూమిపైవ్యాపించినను, ఆకాశమునందు గోమూత్రమువంటి కాంతులు దట్టముగా వ్యాపించినను, తప్పక వర్షము కురియునని శాస్త్రవేత్తలు చెప్పియున్నారని తా.

**వ॥ ఇది గ్రహణోత్పాతలక్షణం బిఁక మేఘలక్షణం బెట్టిదనిన॥ 28**

**తా॥ ఇది ఇతి॥** ఇప్పుడు చెప్పినది గ్రహణోత్పాతలక్షణమును, వర్షచిహ్న లక్షణమును. ఇక మేఘలక్షణమును జెప్పుచున్నాను వినుము.

## మేఘలక్షణము

**క. గిరులగతిఁ దరుకదంబము । వరుసను గరిఘటలమాడ్కిఁ బన్నిన ధారా ।**
**ధరములు సస్యవితానము । బరుపడి నలరింపకున్నె బహువర్షములన్ ॥29**

**తా॥ గిరుల ఇతి ॥** పర్వతములవలెను, వృక్షసముదాయమువలెను, ఏనుగు కుంభస్థలములవలెను, ఉండునట్టి మేఘములు సకల సస్యములు ఫలించునట్లుగా మంచివర్షము నిచ్చునని తా.

**క. గోవుల కైవడి జలరుహ । కావళి చందమున రాజహంసలరీతిన్ ।**
**భావింపఁగ నోదెలగతి । భావజహర మొగులుఁబన్న బహువృష్టియగున్ ॥30**

**తా॥ గోవుల ఇతి ॥** వెట్టియావుల వన్నెగాను, తామరల వన్నెలాగునను, రాజహంసల వన్నెగాను, ఓదెల మాదిరిగాను (కోసిన పైరు ఎండుటకుగా వేయునట్టి చిన్న చిన్న కుప్పలు) మేఘములు ఉన్నయెడల తప్పక మంచి వాన కురియునని తా.

**ఆ.వె. మకరకుంభపూర్ణ మత్స్యవరాహోరు । మహిషపంక్తిరీతి మహినిమేఘ ।**
**నికరమభ్రవీథి నెలకొన్న వరసస్య । కోటివెలయ వానగురియునండ్రు ॥31**

**తా॥ మకర ఇతి॥** మొసళ్ళ యాకృతిలాగునను, కుంభసముదాయములాగునను, మత్స్యములవరుసవలెను, వరాహముల సముదాయమురీతిగను, ఎనుముల (గేదెల) బారులాగునను, మేఘములు పట్టెనేని తప్పక సస్యములు చక్కగా ఫలించుటకు దగిన మంచి వర్షములు కురియునని తా.

**సీ. చెన్నారు మేఘంబు చెఱువులచందానఁ గరమొప్ప నంబుజాకరములట్లు ।**
**వాహినీనికరంబు వడుపున గృహపంక్తి విధమున [2]నవసౌధ వితతిరీతి ।**
**మున్నీటికల్లోలముల బోలిఖర్జూర తరువులచందాన దర్పితోరు ।**
**వృషభేంద్రములరీతి వివిధసైకతముల భాతి నాకసమునఁ బన్నెనేని ॥**

**ఆ.వె. భూరిసస్యరాశిఁ బొదలించు భూజన । కోటియలరవాన గురియునండ్రు ।**
**శ్రీనగేంద్రధామ! చిద్వ్యోమపథసోమ! । భక్తవనజమిత్ర! ఫాలనేత్ర! ॥ 32**

**తా॥ చెన్నారు ఇతి ॥** భక్తపోషణ రతుండవైన యోసాంబమూర్తీ! చెఱువుచందమునను,

తామరకొలనులలాగును, నదులలాగునను, ఇండ్లవరుసలాగునను, మేడల సముదాయము వలెను, సముద్రములోని పెద్దపెద్ద అలల లాగునను, ఖర్జూర వృక్షములలాగునను, గర్వించిన ఆబోతులలాగునను, నానావిధములయిన ఇసుకపట్టులలాగునను, మేఘములు ఆకాశము నందు వ్యాపించినట్టులయిన సకల జనులు సంతసించులాగునను, సకలసస్యములు ఫలించులాగునను, వర్షములు కురియునని తా.

**క. అనయము నాషాఢయుగం । బున నుత్తరభాద్రయందుఁ బొలుపెసఁగు ధని ।**
**ష్ఠను నింగి గిరుల విధమున । ఘనపటలము దోఁచెనేని ఘనవృష్టియగున్ ॥33**

**తా॥ అనయము ఇతి ॥** పూర్వాషాఢనక్షత్రమునందుగాని, ఉత్తరాషాఢ నక్షత్రమునందు గాని, ఉత్తరాభాద్ర నక్షత్రమునందుగాని, ధనిష్ఠయందుగాని, ఆకాశమునందు మేఘములు పర్వతముల యాకృతిగలవియై కనుపట్టెనేని గొప్పవర్షము కురియునని తా.

**క. జ్వలన యమ రక్షసాశల । నెలకొని మొగులుఱిమెనేని నీరంబులు లే ।**
**వల హరిహర సోమానిల । జలధీశులదిశల నుఱుమ జలవృద్ధియగున్ ॥34**

**తా॥ జ్వలస ఇతి॥** ఆగ్నేయమూలనుండిగాని, దక్షిణదిక్కునుండిగాని, నిరృతిమూల నుండిగాని, మేఘములు ఉరిమినట్టయిన వర్షములేదని తెలిసికొనవలయును. పడమటి దిక్కునుండిగాని, వాయువ్యదిశనుండిగాని, ఈశాన్యదిక్కునుండిగాని, తూర్పుదిక్కు నుండి గాని, ఉత్తరదిక్కునుండిగాని మేఘములు ఉరిమినట్టయిన వర్షములు కురియునని తాత్పర్యము.

**ఆ.వె. గగనమండలమునఁ గనఁబడి మేఘంబు।పొలుపు మిగుల నమరపురము భాతిఁ।**
**బన్నెనేని నాఁడె బహువృష్టి యగునని । చెప్పిరార్యజనులు శ్రీగిరీశ! ॥ 35**

**తా॥ గగన ఇతి ॥** శ్రీశైలవాసుండవగు నోసాంబమూర్తీ! ఆకాశమునందు మేఘములు స్వర్గమురూపముగా (అమరావతిపురములాగున) కనుపడెనేని తప్పక ఆదినముననే అమితమగు వర్షము కురియునని తాత్పర్యము.

**క. దానవ పిశాచ పన్నగ । వానర నికరములఁ బోలు వారిజపంక్తుల్ ।**
**బూని నభంబునఁ బలుమఱుఁ । గానఁగ నగునేని వానఁగలుఁగదు ధాత్రిన్॥36**

**తా॥ దానవ ఇతి॥** దానవుల రూపములవలె వికారములును, భయంకరములును, అగు రూపములుగాను, పిశాచరూపములుగాను, సర్పములరూపములుగాను, వానర రూపములుగాను, ఉండునట్టి మేఘములు ఆకాశమునందు కనుపట్టెనేని వర్షము కురియదు అని తా.

ఆ.వె. మొగులు సారమేయముల రీతి నెలుఁగుల । భాతిఁ బులుఁగులట్లు బన్నెనేని ।
వానగురియదంద్రు వరశాస్త్రనిపుణులు । భక్తవనజమిత్ర! ఫాలనేత్ర! ॥ 37

**తా॥ మొగులు ఇతి ॥** భక్తులపాటిలి కల్పవృక్షమవగు నోసాంబమూర్తీ! కుక్కలరూపము గాను, ఎలుగుబంట్లరూపముగాను, పక్షులరూపముగాను, మేఘములు పట్టెనేని వర్షము కురియదని శాస్త్రము తెలిసినవారు చెప్పుచున్నారని తా.

క. చనుమొగులు దిశలనెల్లను । మునుచీఁకట్లుగను జేసి మొగివిచ్చుచు మం ।
చనుబోలెఁ జినుకుచుండినఁ । ఘనవర్షము నమ్మియుండఁగా జనదుజనుల్॥38

**తా॥ చను ఇతి ॥** నలుదిక్కుల పరవులెత్తుచు నిమిషములో ప్రపంచమునంతను ముంచులాగున చుట్టును జీకట్లుకమ్ములాగు చేయుచు నిమిషములో విచ్చిపోవుచు మంచులాగును అక్కడక్కడ కొంచెము నీటిబొట్లను వదలుచు నుండు మేఘములు ఎంతమాత్రము వర్షింపవని తెలిసికొనవలయునని తా.

వ॥ ఇది మేఘలక్షణం బింక పరివేషలక్షణం బెట్టిదనిన ॥ 39

**తా॥ ఇది ఇతి॥** ఇప్పుడు చెప్పినది మేఘలక్షణము. ఇక పరివేషలక్షణమును చెప్పుచున్నాను వినుము.

## పరివేష లక్షణము

ఆ.వె. పుబ్బయాదిగాగఁ బొలుపారు నలమట । దనరు హరిశశాంక తారలందు ।
నింద్రచాపమయినఁ జంద్రుని పరివేష । విశదమయిన నధికవృష్టిఁజేయు ॥40

హరితార - శ్రవణము ॥ శశాంకతార - మృగశిర॥

**తా॥ పుబ్బ ఇతి॥** పుబ్బ నక్షత్రము మొదలుకొని శ్రవణమువఱకునుండు పండ్రెండు నక్షత్రములలోపల ఏనక్షత్రమునందుగాని, మృగశిరానక్షత్రమునందుగాని, ఇంద్రధనుస్సు వేసినప్పటికిని, చంద్రునకు పరివేషము (గూడు) గట్టి చక్కగా కనుపించినప్పటికిని, అధికవర్షము కురియునని తా.

క. ఇనచంద్రుల పరిధులలోఁ । గనుఁగొనఁగా శుక్రుఁడుండఁ గడుదుర్మతులై ।
యనిసేయుదు రవనీశ్వరు । లని చెప్పిరి శాస్త్రవేదు లర్ధేందుధరా! ॥ 41

**తా॥ ఇనచంద్రుల ఇతి ॥** బాలచంద్రునిధరించిన ఓసాంబమూర్తీ! సూర్యపరివేషము నందుగాని, చంద్రపరివేషమునందుగాని అనగా శుక్రుడు అస్తమింపక కనుపించుచుండగా శుక్రుడు కనిపించినట్టయిన రాజులు దుర్మార్గులయి యుద్ధము చేయుదురని తా.

**క. ఇనచంద్రుల పరిధులలోఁ । గనుఁగొనఁగా నెఱ్ఱనయినఁ గవిబుధభువిజుల్ ।**
**శనిఁగూడి యందు నిలిచిన । జనపదములు చిన్నబోవు చంద్రార్ధధరా! ॥42**

**తా॥ ఇనచంద్రు ఇతి॥** బాలచంద్రశేఖరా! చంద్రుని పరివేషము లోపలగాని, సూర్యుని పరివేషములోపలగాని, ఎఱ్ఱగా గనుపించినప్పటికిని, శుక్రుడు, బుధుడు, అంగారకుడు, శనితోకూడియున్నప్పటికిని గ్రామములు చిన్నబోవును. అనగా పాడుపడి వన్నె తఱిగిపోవునని తాత్పర్యము.

**క. ఏనరపతి జన్మంబున । భానుఁడు గ్రహయుక్తుఁడగుచుఁ బరివేషములో ।**
**గానఁగఁ బడియెడు ధరనా । మానవపతి కేలగలుగు మానముబ్రదుకున్ ॥43**

**తా॥ ఏనర ఇతి ॥** ఏరాజు పుట్టినకాలమునందు సూర్యుడు గ్రహణయుతుడయి పరివేషమునందు కనుపించునో ఆరాజునకు భూమియందు ఎంతమాత్రమును ప్రాణములు దక్కవు. ఒకవేళ బ్రతికియున్నను మానభంగము కలుగునని తా.

**క. ఇనశశిబింబము లెంతయుఁ । దనరారెడు రుచులు మాని దర్పములోనై ।**
**విను తెల్లని పరిధులలోఁ । గనుపట్టిన వఱపులేదు గౌరీనాథా! ॥ 44**

**తా॥ ఇన శశి ఇతి॥** ఓగౌరీనాథా! సూర్యుడుగాని, చంద్రుడుగాని, కళలుతగ్గి తెల్లని పరివేషములతో గనుపించునట్టయిన ఆసంవత్సరము దేశమున వర్షములు ఉండునుగాని బెట్టయుండదని తా.

**ఆ.వె. ఒండు రెండు గ్రహము లుండగఁ బరివేష । మండలమున భానుఁ డుండెనేని।**
**మండలాధిపతులు మడియుట యొండెను । కొండలురులవాన గురియుటొండె॥45**

**తా॥ ఒండు ఇతి॥** సూర్యుడు పరివేషగతుడయి యుండుకాలమున ఒక్కగ్రహముగాని, రెండుగ్రహములుగాని, సూర్యునితోగూడి యుండిరేని, మండలాధిపతులకు మరణము కలుగును. అట్లు జరుగనిపక్షమున కొండలు ఉర్లులాగున వర్షము కురియును. అనగా మితిలేని వానలు కురియునని తా.

**వ॥ ఇది పరివేషలక్షణం బింక శుక్రోదయాస్తలక్షణంబు లెట్టివనిన ॥ 46**

**తా॥ ఇది ఇతి॥** ఇప్పుడు చెప్పినది పరివేషలక్షణము. ఇక శుక్రోదయమును శుక్రాస్తమయమును జెప్పుచున్నాను వినుము.

## శుక్రోదయాస్తలక్షణము

క. **తరణియు మొదలిడి యెన్నఁగ । వరతారలు తొమ్మిదేసి వరమేరునగో ।**
**త్తర మధ్యంబునఁ గిన్నర । వరవందిత దానుదక్ష వలననుదిరుగున్ ॥ 47**

**తా॥ తరణియు ఇతి॥** కిన్నరవర వందితుడవగు నోసాంబమూర్తీ! సూర్యుడు మొదలుగాగల నవగ్రహములును మేరుపర్వతమునకు బ్రదక్షిణము చేయుచుండునని తా.

క. **గొనకొని బుధునకు ముందట ।**
**ఘనముగ శుక్రుండు నడువఁగా వఱపగు స ।**
**న్మునివందిత! శుక్రునకును ।**
**మును బుధుఁడుదయించి సస్యమున్ బ్రోచుఁగడున్॥ 48**

**తా॥ గొనకొని ఇతి॥** మునీంద్రవందితుడవగు నోసాంబమూర్తీ! మేరువునకు బ్రదక్షిణముగా వచ్చుచుండు గ్రహములలో బుధునకు ముందుగా శుక్రుడు నడుచుచున్న సంవత్సరమున వర్షములు లేవనియును, శుక్రునకుముందు బుధుడు ఉదయించిన సంవత్సరము సస్యములు చక్కగా వృద్ధిబొందునని తా.

ఆ.వె. **పొలుపు మిగుల గాలి భుజగాఖ్య తారల । నొండెఁజిత్తనైన నుదయమైన ।**
**గ్రహము లెస్సలైన రాజుల దర్పంబుఁ । జెఱుతురొండె వానఁజెఱుతురొండె॥49**

**భుజగతార - ఆశ్లేష ॥**

**తా॥ పొలుపు ఇతి ॥** స్వాతీనక్షత్రమునందుగాని, ఆశ్లేష నక్షత్రమునందుగాని, చిత్తానక్షత్రమునందుగాని ఉదయించిన శుక్రగ్రహము రాజుల గర్వమును అణగించును. అట్లు గర్వభంగము చేయనియెడల వర్షమునకు భంగమునైనను కలిగించునని తా.

సీ. **పొలుపారు శ్రావణంబునఁ గార్తికంబున మార్గశిరంబున మాఘమాస ।**
**మున జ్యేష్ఠమునఁజుక్క మొగిఁ గ్రుంకెనేనియుఁ బొడిచెనేనియుభానుఁ బొదివి రాహు।**
**కబళించెనేనియుఁ గలుగదు వర్షంబు గ్రహరాజునకు నుత్తరమున శుక్రుఁ**
**డుదయించినను జెడు నుర్వితలంబెల్ల భూమీశ్వరులలోనఁ బోరుపుట్టు ॥**

ఆ.వె. **ననుచుఁ దెలియఁజెప్పి రాదిదైవజ్ఞులు । నెమ్మి సకల జనులు సమ్మతింప ।**
**నిగమవనమృగేంద్ర! నిర్మలగుణసాంద్ర! । భక్తవనజమిత్ర! ఫాలనేత్ర! ॥50**

**తా॥ పొలుపారు ఇతి॥** ఓసాంబమూర్తీ! శ్రావణమాసమునందుగాని, కార్తికమాసము నందుగాని, మార్గశిరమాసమునందుగాని, మాఘమాసమునందుగాని, జ్యేష్ఠమాసమునందు

గాని, శుక్రుడు అస్తమించినప్పటికిని, ఉదయించినప్పటికిని, ఆమాసములందు భానుడు రాహువుచే బట్టబడినను, అనగా రాహుగ్రస్త సూర్యోపరాగముకలిగినను, ఆసంవత్సరము వర్షము ఉండదు. సూర్యునకు ఉత్తరమున శుక్రుడు ఉదయించినట్లయిన రాజులకు యుద్ధము కలుగుననియును, అందుమూలమున భూమియంతయు పాడయిపోవుననియును దైవజ్ఞులు చెప్పిరని తా.

**ఆ.వె. భరణి యాదిగాఁగఁ బరువడి నన్నాల్గు । తారకముల యందు దనుజగురుఁడు ।**
**పొడువఁ గ్రుంకఁ బసులు పొంపరిచెడుఁగాని। నెఱయఁబండు ధాన్య నికరమెల్ల॥51**

**తా॥ భరణి ఇతి॥** భరణీనక్షత్రము మొదలుకొని మృగశిరానక్షత్రము వఱకుగల నాలుగు నక్షత్రములయందును శుక్రుడు ఉదయించి నప్పటికిని, అస్తమించిన్పటికిని, పశువులకు నష్టము కలుగును. అయినను సకలవిధములయిన ధాన్యములును పండునని తా.

**క. తడయక యార్ద్రం బాదిగఁ । గడఁగొని యావనజ తారకంబుల భృగుజుం ।**
**డొడఁబడ నెత్తిన నధికపు । జడియగు విప్రులకు సస్యసముదయములకున్ ॥52**

**తా॥ తడయక ఇతి॥** ఆరుద్రనక్షత్రము మొదలుకొని ఆశ్లేషానక్షత్రమువఱకుగల నక్షత్రములలో నెందుగాని శుక్రుడు ఉదయించినట్టయిన బ్రాహ్మణులకును సస్యములకును ఆసంవత్సరము కష్టము కలుగునని తాత్పర్య.

**క. కనుఁగొనఁగ మాఘపంచమిఁ । బొనరంగా భృగుసుతుండు వొడమిన మఱి గ్రుం।**
**కినఁ బసులకు భూజనులకు । జనపతులకుఁ గీడుపుట్టు జంద్రాభరణా! ॥53**

**తా॥ కనుగొన ఇతి॥** ఓచంద్రాభరణా! మాఘమాసమున పంచమియందు శుక్రుడు ఉదయించినప్పటికిని, అస్తమించినప్పటికిని, పశువులకును జనులకును, రాజులకును, ఆసంవత్సరము కీడు కలుగునని తాత్పర్యము.

**క. స్వాతిత్రయమున శుక్రుఁడు । బ్రాతిగ గ్రుంకినను నెన్నఁబడునేనియు న ।**
**త్యాతత వర్షంబులు బ్ర । ఖ్యాతములగు వఱపులవియు నబ్జాభరణా! ॥ 54**

**తా॥ స్వాతి ఇతి॥** స్వాతి, విశాఖ, అనూరాధ అనుమూడు నక్షత్రములలో ఏనక్షత్రము నందుగాని శుక్రుడు ఉదయించినప్పటికిని, అస్తమించినప్పటికిని, గొప్పగొప్ప బెట్టలన్నియు తొలగులాగున అమితముగ వర్షముకురియునని తా.

**క. ఆరయ జ్యేష్ఠయు మొదలుగఁ । దారక పంచకమునందు దనుజేజ్యుఁడు బెం ।**
**పారఁగఁ బొడిచినఁ గ్రుంకిన । దూరములగు వాన మిగుల దుర్భిక్షమగున్ ॥55**

**తా ॥ ఆరయ ఇతి॥** జ్యేష్ఠానక్షత్రము మొదలుకొని శ్రవణమువఱకుగల అయిదు నక్షత్రములలో ఏనక్షత్రమునందుగాని శుక్రుడు ఉదయించినప్పటికిని అస్తమించినప్పటికిని ఆసంవత్సరము వర్షములు కురియక దేశమునకు దుర్భిక్షము కలుగునని తా.

**క. ఎసఁగ ధనిష్ఠయు మొదలుగ । నసదృశమగు తారకంబు లయిదిఁటిలోనన్ ।**
**న్నసురేజ్యుఁ దొడువఁ గ్రుంకిన । వసుధేశులఁ జెఱుచు సస్యవర్గముఁ బ్రోచున్ ॥56**

**తా॥ ఎసగ ఇతి॥** ధనిష్ఠనక్షత్రము మొదలుకొని రేవతి నక్షత్రమువఱకుగల అయిదు నక్షత్రములలో ఏనక్షత్రమునందుగాని శుక్రుడు అస్తమించినప్పటికిని ఉదయించినప్పటికిని రాజులకు నష్టము కలుగును. సస్యములు చక్కగా ఫలించునని తా.

**క. రవి యుత్తరముఁ బొడమినఁ । గవి దక్షిణవీథులందుఁ గడువఁగ వానల్ ।**
**సవరుగనీగతి గోడ్పడి । యవితథ వర్షంబు గురియు నర్ఘముఁబెంచున్ ॥57**

**తా॥** రవి ఇతి॥ రవి ఉత్తరాయణమునందుండగ శుక్రుడు దక్షిణమార్గమునందుండెనేని ఆసంవత్సరము వర్షములు ఎక్కసక్కెముగా కురియును. అనగా సమయమునకు గురియవు. అకారణముననే ధాన్యాదులకు వెలలు అధికముగనుండునని తా.

**సీ. కొమరారు మఖపంచకమునఁ దూర్పున శుక్రుఁ డరుగంగ నవనికి నతులవృష్టిఁ ।**
**జేయు నయ్యేనింటఁ జెఱుచు వానలు లేక నెఱిపంచకంబున నిలిచెనేని ।**
**నటుగాక స్వాతిత్రయంబున నాతండు యీరెండు దిక్కులం దెనసెనేని ।**
**విపరీత ఫలమిచ్చు వెసవక్రుఁడయి యున్న మేలుసేయక కీడు మిగులఁజేయు॥**

**ఆ.వె. బరులచేత నోటవడె నేని నెద్దియుఁ । జేయలేదుతోనఁ జెండవృత్తిఁ ।**
**దెలియవలయు ననియె దివిజజ్ఞ నికరంబు । భక్తవనజమిత్ర! ఫాలనేత్ర! ॥58**

**తా॥ కొమరారు ఇతి॥** శుక్రుడు మాఘానక్షత్రము మొదలుకొని చిత్తానక్షత్రమువఱకు గల అయిదునక్షత్రములలో దేనియందుగాని యుండి తూర్పునకేగినట్టయిన భూమియందు అతివృష్టి కురియును. ఆ మఘ మొదలుగాగల అయిదు నక్షత్రములయందు శుక్రుడు వక్రించి యుండినట్టయిన వానలు ఆయేట కురియకుండజేయును. స్వాతి, విశాఖ అనూరాధ అను మూడునక్షత్రములయందు శుక్రుడు ఉండి రెండు దిక్కుల కాన్పించుచున్నట్టయిన విరుద్ధఫలము కలుగును. ఆస్వాత్యాది మూడునక్షత్రములయందును వక్రుడయియున్నట్టులైన మేలుచేయుటకు బదులుగా నెక్కువగా పరులచేత అనగా శత్రువులచేత దేశమునకునష్టమును కలిగించును. అదియునుగాక అట్టిసమయమునందు బలహీనుడయి యున్న పక్షమున పై జెప్పియున్న దోషములను వేనినిగాని చేయలేదు అని జ్యోతిశ్శాస్త్రవేత్తలు చెప్పియున్నారని తా.

**తరలవృత్తము:**

**భరణి యాదిగ రెండుతారల ఫల్గునీయ నిశంబులన్ ।**
**హరవిశాఖల పైతృభోజననాదిమంబగు భద్రవి ।**
**స్ఫురితవాయు సురేజ్యతారల శుక్రుఁడోలిఁ జరింపఁగా ।**
**ధరణి వానను దోఁగు శ్రీగిరిధామ! సోమకళాధరా! ॥**

**హరమనఁగా – ఆర్ద్ర, పైతృభమనగా – మఘ, ఆది భద్రమనఁగా – పూర్వాభాద్ర. వాయువనఁగా – స్వాతి. సురేజ్యతార – పుష్యమి. 59**

**తా॥ భరణి ఇతి॥** శ్రీశైలవాసుడవగు నోచంద్రశేఖరా! భరణీనక్షత్రమునందుగాని, కృత్తికయందుగాని, ఫల్గునీనక్షత్రమునందుగాని, ఆరుద్రయందుగాని, విశాఖయందుగాని, మఘయందుగాని, పూర్వాభాద్రయందుగాని, స్వాతియందుగాని, పుష్యమి నక్షత్రమునందు గాని, శుక్రుడు ఉండునపుడు వర్షము భూమియందు ఉండునని తా.

**ఆ.వె. మూల చిత్త జ్యేష్ఠ ముదమగు రోహిణి । యమర వైశ్వదైవికమున హస్త ।**
**తార నదితియందు దనుజేజ్యుఁ డుండంగ । వాన లేల గురియు వసుధలోన॥**

**వైశ్వదైవికమనగా – ఉత్తరాషాఢ, అదితియనఁగా – పునర్వసు. 60**

**తా॥ మూల ఇతి॥** శుక్రుడు మూలానక్షత్రమునందుగాని, చిత్తయందుగాని, జ్యేష్ఠ యందుగాని, రోహిణియందుగాని, ఉత్తరాషాఢయందుగాని, హస్తయందుగాని, పునర్వసు నందుగాని, ఉండినట్టయిన భూమియందు వర్షములు కురియనే కురియవని తా.

**ఆ.వె. రాజమౌళి! యుత్తరాషాఢనొందేని । ఖైతృభమున నొందె భార్గవుండు ।**
**వక్రుఁడగుచుఁగ్రుంక వానలు గలుగవు । పోరుసేయు రాజపుత్రులకును ॥**

**పైతృభమనఁగా – మఘ. 61**

**తా॥ రాజమౌళి ఇతి॥** ఓచంద్రమౌళీ! ఉత్తరాషాఢయందుగాని, మాఘయందుగాని, శుక్రుడు వక్రుడై అస్తమించినట్టయిన భూమియందు వర్షములు కురియనే కురియవు. రాజులకు ఘోరములయిన యుద్ధములు కలుగునని తాత్పర్యము.

**గద్యము. ఇది సకలజనస్తుత్య దోనయామాత్య ప్రణీతంబైన**
**సస్యానందంబునందు**
**తృతీయాధికారము.**

ఇట్లు తృతీయాధికారము ముగిసెను.



1. కనుగొన మృగశీర్షమె తుదగాగల రిక్కులలో వారుణముల్ (పూ.ము.పా.)
2. ఘనసౌధ (పూ.ము.పా.)

శ్రీరస్తు

# సస్యానందము - చతుర్థాధికారము

## గ్రహచార లక్షణము

క. **గురుతోడఁ గూడెనేనియు । గురునకు నేడింటనేని గురుతర వక్రో ।**
**దరుఁడయి శుక్రుఁడురాజులఁ । బొరిగొను గాకేమి వానపొంగడగించున్॥1**

**తా॥ గురు ఇతి॥** శుక్రుడు గురువుతో గూడియున్నప్పటికిని, గురువునకు ఏడవయింట శుక్రుడు వక్రించియున్నప్పటికిని, రాజులు నశింతురు. అట్లు జరుగనియెడల వర్షములు తక్కువగా కురియునని తాత్పర్యము.

క. **నింగికిఁ జంద్రాత్మజునకు । ముంగలియై వానజేయు మొగిభార్గవుఁడా ।**
**నింగికిఁ దత్పుత్రునకున్ । వెంగలియై సస్యకోటి పెంపడఁగించున్ ॥ 2**

**తా॥ నింగికి ఇతి॥** పుబ్బానక్షత్రమునకును, బుధునకును, శుక్రుడు ముందుగానుండినట్లులైన ధరణియందు వర్షములు కురియును. పుబ్బకును, బుధునకును వెనక శుక్రుడు ఉండినట్టులయిన సస్యములు చక్కగా వృద్ధిబొందవని తాత్ప.

ఉ. **ఆరయ భార్గవుం డుదయమందెడు నప్పుడుఁ గ్రుంకునప్పుడున్ ।**
**జేరువనున్న యగ్గురుని జెచ్చెర గెల్చిన వానజేయు [1]సం ।**
**వారముజేయు నాతనికి వావిరిఁదోడ్పడి గ్రుంకియుర్వికిన్ ।**
**భోరనదోఁచువృష్టి భువిభూషణ! శ్రీగిరిమల్లికార్జునా! ॥ 3**

**తా॥ ఆరయ ఇతి ॥** శుక్రోదయ సమయమునందుగాని, శుక్రాస్తమయసమయమునందుగాని, శుక్రుడు సమీపమున నున్న గురుని జయించినట్టయిన (అనగా అతనికి ముందు బోయినట్టయిన) వర్షము కురియును. కురియకుండగూడనుండును. అనగా మధ్యవృష్టికలుగును. ఆ శుక్రుడు గురునితోగూడ నేకకాలమున అస్తమించినను, ఉదయించినను భూమియందు వర్షము సమృద్ధిగా కురియునని తా.

క. **నెలకొని సురదానవమం । త్రులు మిథునమునందు నుండ రోగాతురులై ।**
**పొలియుదు రసినిన్ జనులని । దెలిపిరి దైవజ్ఞమునులు త్రిపురఘ్న హరా! ॥4**

**తా॥ నెలకొని ఇతి॥** త్రిపురాసుర సంహారకుడవగు నోసాంబమూర్తీ! శుక్రుడును,

గురువును, మిథునరాశియం దేకకాలమునందు ఉండిరేని జనులు వ్యాధులవలనను, ఖడ్గమువలనను, నశింతురని దైవజ్ఞులు చెప్పిరని తాత్ప.

**క. స్వాతిత్రయమున గురుఁడును । ఖ్యాతిగ మఖ పంచకమున నసురేజ్యుఁడు సం।**
**ప్రీతిఁ జరింపఁగ దినకర । శీతాంశులుజేర నెల్లసృష్టికలంగున్ ॥ 5**

**తా॥ స్వాతి ఇతి ॥** స్వాతి, విశాఖ, అనూరాధ అను మూడునక్షత్రములలో ఏనక్షత్రమునందుగాని గురువును, మఘ, పుబ్బ, ఉత్తర, హస్త, చిత్త అను నయిదు నక్షత్రములలో ఏనక్షత్రమునందుగాని శుక్రుడును, సూర్యచంద్రులతో గలిసియుండిరేని ప్రపంచము క్షోభమునొందునని తా.

**క. గురుఁడును బుధుఁడును దానవ । గురుఁడును గదియంగ మేఘకోటులు తఱచై ।**
**గురుతర వృష్టింజేయును । బొరిపొరి జనులెల్ల బొగడ భుగజాభరణా! ॥ 6**

**తా॥ గురుడు ఇతి॥** ఓ శేషభూషణుడా! గురువును, బుధుడును, శుక్రుడును ఏకరాశిగతులయిరేని మేఘములు మెండయి ఆసంవత్సరము వర్షము మెండుగా భూమికి ఇచ్చునని తా.

**క. నెలకొని బుధగురు లుండిన । గలుగదు వర్షంబు వక్రగతులయి శని భౌ ।**
**ములుఁగూడ ధాత్రివర్షం । బులుగానక పశుగణంబుఁ బొలియుగిరీశా! ॥7**

**తా॥ నెలకొని ఇతి॥** గిరీశుడవగు ఓసాంబమూర్తీ! బుధగురువులు ఏకరాశిగతులయి నను, దేశమునందు వానలు ఉండవు. శనియును అంగారకుడు వక్రించి ఏకరాశిగతులయి నట్టయిన ఆసంత్సరము దేశమునందు వర్షములు కురియవు. మఱియును పశు సముదాయమునకు నష్టము కలుగునని తా.

**క. దానవగురుఁడును బుధుఁడును । మానుగ నడువంగ నడుమ మహిమోజ్జ్వలుఁడై।**
**భానుఁడు నడచిన ధరలో । వానలు గలవనెడి వెఱ్ఱివారుంగలరే ॥ 8**

**తా॥ దానవ ఇతి॥** శుక్రునకును, బుధునకును, మధ్య సూర్యుడు ఉండినట్టులయిన ఆ సంవత్సరము వర్షములు కురియనే కురియవని తాత్పర్యము.

**క. దానవగురుఁడును భౌముఁడు । భానుజుఁడును గూడ మేఘపటల మడంగున్ ।**
**వానలు కొలఁదులు మీఱును । మానుగ ముప్వురును దేవమంత్రియు గూడన్ ॥9**

**తా॥ దానవ ఇతి ॥** సూర్యుడును, అంగారకుడును, శుక్రుడును ఏకరాశిగతు లయినట్టయిన ఆసంవత్సరము మేఘములు పట్టనే పట్టవు. సూర్యుడును, అంగారకుడును,

శుక్రుడును, గురువును, ఏకరాశిగతులయినట్టయిన ఆసంవత్సరము దేశమునందు అమితమగు వర్షము కురియునని తా.

**ఆ.వె. నెఱయ గురుఁడు రోహిణీ మధ్యమున నుండి । వక్రయుక్తుడయిన వానలేదు ।**
**వాయుతారలందు వక్రించి నిలిచిన । వారిమయము జేయు వసుధయెల్ల ॥10**

**తా॥ నెఱయ ఇతి ॥** గురుడు రోహిణీ నక్షత్రమునందు ఉండగా (అనగా వృషభరాశి యందు ఉండగా) వక్రించినట్టయిన ఆసంవత్సరము వర్షము ఉండదు. గురువు పూర్వాషాఢ నక్షత్రమునందుగాని, స్వాతీనక్షత్రమునందుగాని, వక్రించియుండినట్టయిన భూమియంతయు జలమయమగును. అనగా అమితమగు వర్షము కురియునని తా.

**క. రవిముందట భానుజుఁడును । గవిమ్రోలను మహిసుతుండుఁ గ్రమముగ నడువన్।**
**భువిలోపల వర్షంబులు । తివుటం దేజముడిగించు తెఱఁగయి యుండున్ ॥11**

**తా॥ రవి ఇతి॥** సూర్యునిముందు శనియును, శుక్రునకుముందు అంగారకుడును, సంచరించినట్టయిన ఆసంవత్సరము వర్షములు కోరికకు దగినట్లు కురియును, ఎండలును మెండుగా నుండవని తా.

**క. ఎసఁగఁగ వక్రించి పున । ర్వసు నుండిన భూమిజునకు వావిరిఁదోడై ।**
**యసురేజ్యుడు జనుదెంచిన । వసుమతి జలమయముఁజేయు వసునాథసఖా! ॥12**

**తా॥ ఎసగ ఇతి॥** కుబేరమిత్రుడవగు నోయీశ్వరుడా! వక్రించి పునర్వసునక్షత్రము నందున్న అంగారకునితో శుక్రుడు కలసియున్న యెడల ధరణియంతయు జలమయమగునని తా.

**క. ధరణిసుతుండును శుక్రుఁడు । గురుఁడును నొకరాశినుండఁ గుంభినివఱపుల్ ।**
**గురుఁడే రిక్కలనయినను । నురువడి భేదించి చనిన నురువృష్టియగున్ ॥13**

**తా॥ ధరణి ఇతి॥** అంగారకుడును, గురుడును, శుక్రుడును ఏకరాశియందుండిరేని ఆసంవత్సరము దేశమునందు వర్షముండదు. ఏ నక్షత్రములయందుగాని గురువు, శుక్రాంగారకులతో విడిబడిపోయినట్టయిన దేశమునందు మంచివానలు కురియునని తా.

**ఆ.వె. వృషభ సింహ మీన వృశ్చిక ధనువులు । భానుపుత్రుఁడేని భౌముఁడేని ।**
**వక్రగతులఁ జనిన వరసస్యకోటులు । పార్వతీశ! యెండ పాల బడవె ॥14**

**తా॥ వృషభ ఇతి ॥** ఓ పార్వతీ పతీ! శనిగాని, అంగారకుడుగాని వృషభరాశి యందుగాని, సింహరాశియందుగాని, మీనరాశియందుగాని, వృశ్చికరాశి యందుగాని,

ధనూరాశియందుగాని వక్రించియుండినట్టయిన పైరులు ఎండలపాలగునేకాని ఆసంవత్స-
రము వర్షములు కురియవని తా.

**క. శనిపిఱుఁద గుజుఁడు నడువఁగ । శనియును వక్రించెనేని జలధరపంక్తుల్ ।**
**కనుపట్టవు గగనంబున । మనసిజహర ధరణినొక్క మాసమువఱకున్ ॥ 15**

**తా॥ శని ఇతి॥** ఓ మదనాంతకా! శనివెంట అంగారకుడు నడచుచుండ అనగా శనిముందును వెనుక అంగారకుడును ఉండగా శని వక్రించినట్టయిన ఆసంవత్సరము ఒకనెలవఱకు దేశమునందు మేఘములు కనుపడనే కనుపడవని తా.

**ఉ. భానుసుతుండు వక్రగతిబాటిన భానునితోడఁగూ డినన్**
**బూనిఝషాళికర్కులను బొల్పగు మూఁడవ పాలు నిల్చినన్ ।**
**జానుగ శ్రీగిరీంద్ర! వృషచాపమృగంబుల మధ్యభాగలం ।**
**గానఁగనైన నన్నములు గానఁగ త్రుంగుదు రుర్వి మానవుల్ ॥ 16**

**తా॥ భాను ఇతి ॥** ఓ శ్రీశైలవాసా! శనివక్రించి సూర్యునితోగూడ మీనరాశియందుగాని, వృశ్చికమునందుగాని, కర్కటకమునందుగాని మూడవభాగమునం దుండినప్పటికిని వృషభరాశియందుగాని, ధనూరాశియందుగాని, మకరరాశియందుగాని రెండవభాగమునం దున్నప్పటికిని భూమియందు బ్రజలు అన్నములేక మలమలమాడి చత్తురు.

**క. సురమంత్రియు దనుజేజ్యుఁడుఁ । దిరులై యొకరాశినుండఁ దెల్లంబుగ శ్రీ ।**
**గిరివల్లభ యక్కాలము । తెరలక పటువృష్టిగురియుఁ దిరముగ భూమిన్ ॥17**

**తా॥ సురమంత్రి ఇతి॥** ఓశ్రీగిరివల్లభా! గురువును, శుక్రుడును సిరులయి ఏకరాశిగతులయినట్టయిన వారు ఆరాశియం దుండునంతకాలము దేశమునందు మంచి వర్షములు కురియునని తా.

[2]చౌపద :

**ఎసఁగఁగ సితునకు నేడగుచోటన్ । మసలిన శనికిని మానుగ సోముల్ ।**
**వెసగను గూడిన వెసమేఘంబుల్ । వసుమతి నుడుఁగని వానలు జేయున్ ॥18**

**తా॥ ఎసగగ ఇతి ॥** శుక్రుడున్న యింటికి ఏడవయింట శనియుండి చంద్రునితో గలసినట్టయిన ధరణియందు విడువని వర్షములు కురియును.

**క. దనుజేజ్యుఁ దున్నరాశికి । నినతనయుఁడు నాలుగింట నింకిట రంధ్రం ।**
**బుననున్న వానగురియును । నినభౌముల లోననొక్కఁ డెడ సొరకున్నన్ ॥19**

**తా॥ దనుజ ఇతి॥** శుక్రుడున్న యింటికి నాలుగవయింటగాని, ఎనిమిదవయింటగాని శనియుండి సూర్యాంగారకులలో నెవరితోగాని నొక్కరితో గూడియుండినట్టయిన భూమియందు వర్షము కురియునని.

**క. శనియును నంగారకుఁడును । మునుశుక్రుఁడు చనిన మార్గమున నడిచిన మే ।**
**దిని జలమయముం జేయును । మనసిజమదహరణ! మేఘమండలి తరుచై ॥20**

**తా॥ శనియు ఇతి ॥** ఓమదనాంతకా! శనియును, అంగారకుడు ముందు శుక్రుడు నడచుచున్న నడచుచున్న మార్గమున చనిరేని అనగా శన్యంగారకులకు ముందు శుక్రుడున్నట్టయిన మేఘములు పెచ్చుపెరిగి భూమినంతను జలమయము చేయునని తా.

**వ॥ ఇది గ్రహచారం బింక బుధోదయం బెట్టిదనిన ॥ 21**

**తా॥ ఇది ఇతి॥** ఇప్పుడు చెప్పినది గ్రహచారము. ఇక బుధోదయమును చెప్పుచున్నాను. వినుము.

## బుధోదయ లక్షణము

**సీ. బుధుఁ దుత్తరాత్రయమునఁ బుష్యమందున నేపారఁ బొడచూపెనేని వారి ।**
**ధారాచయము వసుధాతలంబెలను నితరతారల నుదయించి మించి ।**
**నృపతులఁ బొలియించు నిలరోగములు మించు ధారాధరంబుల దర్పమడఁచు ।**
**నటుగాక తక్కిన పటుమారుతము మించి పెంపారలోకుల సొంపడంచు ॥**

**ఆ.వె. ననుచుఁ దెలియఁజెప్పిరాది దైవజ్ఞులు । నెమ్మి సకలజనులు సమ్మతింప ।**
**శ్రీనగేంద్రధామ! చిద్యోగపథసోమ! । భక్తవనజమిత్ర! ఫాలనేత్ర! ॥ 22**

**వ. ఇది బుధోదయం బింక గ్రహయుద్ధం బెట్టిదనిన॥ 23**

**తా॥ బుధుడు ఇతి॥** ఫాలనేత్రుడవగు నోయీశ్వరా! బుధుడు ఉత్తరానక్షత్రము నందుగాని, ఉత్తరాషాఢా నక్షత్రమునందుగాని, ఉత్తరాభాద్రానక్షత్రము నందుగాని ఉదయించినట్టులయినను పుష్యమీ నక్షత్రమునందు ఉదయించినను ఆసంవత్సరము భూమియంతటను మేఘములు సమృద్ధిగా వర్షించును. ఈపైచెప్పియున్న నక్షత్రముల యందుగాక తక్కిన నక్షత్రములలో ఏనక్షత్రమునందు బుధుడు ఉదయించి నప్పటికిని ఆసంవత్సరము రాజులు ఎక్కువగా మృతినొందుదురు. ఎక్కడచూచినను రోగములు ఎక్కువగా నుండును. మేఘములు తేలిపోవును. అట్టు మేఘములు తేలిపోక వర్షించెనేని

గాలితోగూడ వర్షించి ప్రజలకు ఉత్సాహము తగ్గించును. అనగా పంటలకు భంగము కలిగించును అని భూతభవిష్యత్తులను తెలిసిన జ్యోతిశ్శాస్త్రవేత్తలు చెప్పిరని తా.

ఇప్పుడు చెప్పినది బుధోదయము. ఇక గ్రహయుద్ధము చెప్పుచున్నాను వినుము.

## గ్రహయుద్ధము

**సీ. పెంపారు నమృతాంశు బింబంబు దార్కొని తొలుతగ భౌముండు గలసిచనిన ।**
**ధరణీతలంబెల్లఁ దడియు నెత్తురునీట బుధుడు దూరినవాన పొంగడంగు ।**
**సురమంత్రి గూడినఁ గరియూథములుగ్రుంగు భృగునందనుఁడు దూరిపోయెనేని।**
**బహురోగములచేతఁ బాడగు జగమెల్ల మందుండుగూడిన మండలాధి ॥**

**ఆ.వె. పతుల దర్పమడఁగు బహుభాషణములేల । వానగురియునేని వారిదోష ।**
**సముదయంబు చెఱచు గమలాప్తశశినేత్ర! । చిత్సరోజభృంగ! సిద్ధలింగ! ॥24**

**తా॥ పెంపారు ఇతి ॥** సూర్యచంద్రాగ్ని నేత్రుడవగు ఓసిద్ధలింగస్వామీ! పూర్ణచంద్రుని తోడ ముందుగా అంగారకుడు కలిసిపోయినట్టయిన భూమియంతయు రక్తముతో దడియును అంతటి ఘోరయుద్ధములు కలుగునని భావము. బుధుడు ముందుగా కలసిపోయినట్టయిన వర్షములు నశించును. పూర్ణచంద్రునితోడ ముందుగాగురువు కూడిపోయి నట్టయిన ఏనుగులు గుంపులుగుంపులుగా నశించును. ముందుగా శుక్రుడు చంద్రునితోగూడి పోయినట్టయిన నానావిధములైన వ్యాధులచేత దేశమంతయు పాడగును. శని ముందుగా చంద్రునిగూడి పోయినట్టయిన రాజుల గర్వము నశించును. వర్షము కురిసినట్టయిన రాజుల గర్వమునకు భంగము కలుగదని తెలిసికొనవలయునని తా.

**క. మందుని భౌముఁడు గెల్చిన । మందమహీసుతుల బుధుఁడుమర్దించిన పెం।**
**పొందిన వానలుజేయు న । మందగతింబోరి మేఘమండలితఱుచై ॥ 25**

**తా॥ మందుని ఇతి॥** శనియును, అంగారకుడును రాశిసంచారముచేయునపుడు శనిని, అంగారకుడు సంధించిపోయినట్టయినను, అట్లే శన్యంగారకులను బుధుడు సంధించిపోయినట్టయినను భూనభోంతరములు ఒక్కటిచేయుటకో యనులాగున కాఱు చీకట్లు కమ్మి మేఘములు అమితముగ వర్షించునని తా.

**ఆ.వె. భార్గవుండు చంద్రుఁ బట్టియోడించిన । నీనిశాటుతోడ నింద్రమంత్రి ।**
**యోడిచనిన వాన లుడుగును ధరలోనఁ । జిత్సరోజభృంగ! సిద్ధలింగ! ॥26**

**తా॥ భార్గవుడు ఇతి॥** చిదానందరూపుడవగు నోసిద్ధలింగస్వామీ! శుక్రుడు చంద్రునితో

గూడి పోయినను, ఈశుక్రుడు గురువును ఓడించినను అనగా వెనుకవైచినను, భూమియందు వర్షములు ఉండవని.

**ఆ.వె. బుధుఁడు భార్గవుండు బొలుపొంద నొకరాశి । గూడియుండ వానగురియునొండె। వారిలో నొకండు వక్రుఁడై శరనవ । సంఖ్యనున్న వృష్టిసంభవించు ॥ 27**

**తా॥ బుధుడు ఇతి॥** బుధుడును, శుక్రుడును కలిసి ఒకరాశియందున్నట్టయిన వర్షములు చక్కగా కురియును. బుధ, శుక్రులిద్దఱిలో ఎవరుగాని ఒకరు వక్రించి అయిదవయింటగాని, తొమ్మిదవయింటగాని యున్నట్టయిన భూమియందు వర్షములు కలవని తా.

**క. దివిజారి గురుం డెదిరిన । భువితనయుఁడు వారిఁగెలుచు బోరాటము భా । ర్గవుఁడు సురమంత్రి నొడిచిన । భువి నెత్తుటదోఁగు దేవపూజితచరణా! ॥28**

**తా॥ దివిజా ఇతి॥** దేవపూజిత చరణుండవగు నోసాంబమూర్తీ! శుక్రాంగారకుల యుద్ధములో అంగారకుడు శుక్రునిజయించినట్టయిన భూమియందు యుద్ధములు కలుగునని భావము. గురుశుక్రుల యుద్ధమునందు శుక్రుడు గురువును ఓడించినట్టయిన భూమియందు రక్తము ప్రవహించునని తా.

**ఆ.వె. అనఘ యమరవైరి నంగారకుఁడు బుధుఁ।జంద్రు తోడఁ బోరి జయమునొంద । నవనిఁ బోరుపుట్టు నసురేజ్యుఁడవనిజు । నొడిచెనేని వాన లుర్విఁ గురియు ॥29**

**తా॥ అనఘ ఇతి॥** శుక్రునితో అంగారకుడు యుద్ధముచేసి జయించినను, బుధుడు చంద్రునితో యుద్ధముచేసి జయించినను, భూమి యందు యుద్ధములు కలుగును. శుక్రుడు అంగారకుని జయించినట్టయిన భూమియందు సకల సస్యసమృద్ధిగ వర్షములు కురియునని తా.

**ఆ.వె. గ్రహచతుష్కమేని గ్రహపంచకంబేని । నొక్కరాశిఁ గూడి యుండెనేని । నవనిఁబోరుపుట్టు నటుగాన రాజులు । శ్రీగిరీశ! శాంతి జేయవలయు॥30**

**తా॥ గ్రహ ఇతి॥** ఓశ్రీశైలవాసా! నాలుగు గ్రహములుగాని, అయిదుగ్రహములుగాని ఏకరాశియందు ఉండినట్టయిన భూమియందు రాజులకు యుద్ధము సిద్ధము. కావున, రాజులు అట్టికష్టములు కలుగకుండ గ్రహశాంతి చేయుట మంచిదని తా.

## గ్రహాధికార దేశములు

**క. గంగా హిమవన్మధ్యము । గంగాధర యేలు మందగమనుఁడు భువినా । గంగావింధ్య నగాంతర । మంగజహర! సౌమ్యుఁడేలునంద్రు మునీంద్రుల్ ॥31**

**తా॥ గంగా ఇతి॥** గంగను శిరమున దాల్చిన ఓసాంబమూర్తీ! హిమవత్పర్వ-తమునకును, గంగానదికిని మధ్యప్రదేశమునకు అధిపతి శనియనియును, గంగానదికిని, వింధ్యపర్వతమునకును మధ్యనున్న భూమికి బుధుడు అధిపతియనియును తెలిసికొనవలయునని తా.

**ఆ.వె. వింధ్య శిఖరి నుండి వేడ్కగోదావరి । గుఱుతుగాఁగ దేవగురుఁడు రాజు ।**
**మీఁటి యేలు గౌతమీకృష్ణవేణ్యుత్త । రంబు భార్గవుండు రాజమౌళి! ॥ 32**

**తా॥ వింధ్య ఇతి॥** ఓ చంద్రమౌళీశ్వరా! వింధ్యపర్వతముమొదలుకొని గోదావరి వఱకుగల మధ్యదేశమునకు గురువు అధిపతియనియును, గోదావరికిని కృష్ణానదికిని మధ్యనుండు దేశమునకు శుక్రుడు అధిపతి యనియును తెలిసికొనవలయునని తా.

**ఆ.వె. అరయ గృష్ణవేణి యాదిగానటలంకఁ । దానె యేలు భూమితనయుఁ దుర్వి ।**
**జెలిమి మూఁడులోకములు నేలఁగూడనీ । చంద్రుఁ డర్థినేలు శరభరూప! ॥33**

**తా॥ అరయ ఇతి॥** కృష్ణానదిమొదలుకొని లంకవఱకుగల మధ్య ప్రదేశమునకు అంగారకుడు అధిపతియనియును, చంద్రుడు మూడు లోకములకును అధిపతియనియును తెలిసికొనవలయునని తా.

**క. వైరంబున నొక్కరితోఁ । బోరాటను నొడిచి చిన్నబోయిన గ్రహముల్ ।**
**పోరాటమి గావింతురు । ధారుణి తమదేశములకుఁ దరుణేందుధరా! ॥ 34**

**తా॥ వైరంబున ఇతి ॥** బాలచంద్రుని ధరించిన యోసాంబమూర్తీ! గ్రహములకు యుద్ధమువచ్చినపుడు ఏగ్రహము ఓడిపోవునో ఆగ్రహముయొక్క ఏలుబడిలోనుండు దేశమునకు యుద్ధము కలుగునని తా.

**వ. ఇది గ్రహయుద్ధం బింక వర్షప్రశ్నం బెట్టిదనిన ॥ 35**

**తా॥ ఇది ఇతి॥** ఇప్పుడు చెప్పినది గ్రహయుద్ధమును గ్రహాధికార దేశములు చెప్పబడినవి. ఇక వర్షప్రశ్నమును చెప్పుచున్నాను వినుము.

## వర్ష ప్రశ్నోత్తరము

**సీ. వర్షంబు మదిఁగోరి వసుధేశ్వరుఁడు ప్రశ్న వేడుకఁ జేసిన వేళయెఱిఁగి ।**
**లగ్నంబు శోధించి లగ్నంబునకు రెంట నేనింట నమ్మూట నెనిమిదింట ।**
**శుక్రుండునిల్వ నిర్వక్రుఁడై శుభులును వరుసను నిలిచిన వానజేయు ।**
**నటుగాక లగ్నస్థులయినట్టి యాయిన చంద్రులందొక్కఁడు సప్తమమున ॥**

**ఆ.వె.నుండి రేని వృష్టి కొండలు గదలించు । ననుచుఁ జెప్పవలయు నాత్మనెఱిఁగి ।**
**సకల జనులు వొగడఁ జతురుఁడై దైవజ్ఞు । వరుఁడు శ్రీగిరీశ! వసుధలోన ॥36**

**తా॥ వర్షంబు ఇతి ॥** ఎవరుగాని వర్షమునుగూర్చి ప్రశ్నచేసినట్టయిన ఆప్రశ్న చేసినకాలమును చక్కగా తెలిసి లగ్నమును చక్కగా కనిపెట్టి ఆలగ్నమునకు రెండయింటి యందు శుక్రుడు వక్రింపకుండ నుండగా మూడవయింటియందును, అయిదవయింటి యందును, ఎనిమిదవయింటియందును శుభగ్రహములయిన చంద్ర, బుధ, గురువులు ముగ్గురును క్రమముగా నుండినట్టయిన వర్షములు కురియునని చెప్పవలయును. పైనచెప్పిన బుధ, గురు, శుక్రులలో నెవరుగాని లగ్నమునం దుండగా, సూర్యచంద్రులలో నొకరు ఏడవ యింటియందుండిరేని, పర్వతములను కదలించునంతటి వర్షములు కురియునని చెప్పవలయునని తా.

**క. జలరాశి యుదయమైనను । జలరాసులఁ జంద్రుఁడున్న సౌమ్యులు మిత్ర ।**
**స్థలముల లోపల నిలిచిన । తలఁపులు గడువంగఁ గురియుఁ దరుణేందుధరా!॥37**

**తా॥ జల ఇతి ॥** బాలచంద్రుని ధరియించినట్టి ఓసాంబమూర్తీ! అడిగిన ప్రశ్నలగ్నము జలరాశియయిన్నపటికిని, జలరాసులైన కర్కటక మకర మీనములయందు చంద్రుడు ఉన్నప్పటికిని, శుభగ్రహములయిన చంద్ర బుధ గురు శుక్రులు మిత్రస్థానములయందు ఉన్నప్పటికిని కోరికకు మించిన వర్షము కురియునని ప్రశ్నకు ఉత్తరము చెప్పవలయునని తా.

**ఆ.వె. మొనసి శుభులు లగ్నముల నోజ రాసుల । నుండి రేనిఁ జంద్ర యుక్తులయిన ।**
**నదియు శుక్లపక్షమగునేని వానలు । జేయుననిరి మునులు శ్రీగిరీశ! ॥ 38**

**తా॥ మొనసి ఇతి ॥** వర్షమునుగూర్చి ప్రశ్న చేసినకాలము శుక్ల పక్షముగానుండినను, శుభులయిన చంద్ర బుధ గురు శుక్రులు లగ్నమునందు ఉండినప్పటికిని, అథవా బుధ గురు శుక్రులలో నెవ్వరుగాని చంద్రునితోగూడి ప్రశ్నలగ్నమునందు ఉన్నప్పటికిని వర్షములు మెండుగా గురియునని చెప్పవలయునని తా.

**ఆ.వె. ఏగ్రహంబులయిన విగ్రహశీలులై । చంద్రుదూరి యవియుఁజనియెనేని ।**
**వానకాలమేని వానలుగురియవు । ఎండకాలమేని నుండుబాధ ॥ 39**

**తా॥ ఏగ్రహంబు ఇతి ॥** సూర్యాది గ్రహములలో నేగ్రహములు గాని శత్రుభావముతో చంద్రునిగూడి విడిపోయినట్టయిన ప్రశ్నయడిగినకాలము వర్షకాలమయినను వర్షములు కురియవనియును, వేసగికాలమైనట్టయిన వర్షములు అమితముగా గురియుననియును చెప్పవలసియున్నదని తా.

**ఆ.వె. భూమిపుత్రుఁగప్పి సోముండు నడిచిన । నాహవంబు భూమి నావహిల్లు ।**
**జారచోరబాధ జనియించుఁ బుడమిని । జనుల కెల్లఁ గఱువు చాలఁగలుగు॥40**

**తా॥ భూమి ఇతి ॥** ప్రశ్నకాలమును పరీక్షించి లగ్నము తెలిసికొని ఆలగ్నముప్రకారము చంద్రుడు అంగారకునికప్పిపోయినట్టయిన భూమియందు యుద్ధములు సిద్ధించును. మఱియు జారులవలనను, చోరులవలనను బాధలు అమితములగును. జనులు అన్నము మొదలగునవి లేక కఱువుచేత కష్టములను అనుభవింతురని తా.

**ఆ.వె.ఒండు రెండు గ్రహము లుండంగఁ బరివేష । మండలమునఁ జంద్రుఁ డుండెనేని।**
**మండలాధిపతులు మడియుదు రొండెను । గొండలురుల వానగురియునొండె ॥41**

**తా॥ ఒండు ఇతి॥** ప్రశ్న సమయమునకు లగ్నమునందు ఒకటిగాని, రెండుగాని గ్రహములు ఉండి ఆప్రశ్నసమయమున చంద్రుడు పరివేషములో నున్నట్టయిన అనగా చంద్రునకు గూడుకట్టియున్నట్టయిన మండలాధిపతులు చావనైనను చత్తురు. అట్టు వారు చావకున్న కొండలురులు లాగున వర్షములు అమితముగా కురియునని తా.

**వ. ఇంక గురుచార రాశిఫలం బెట్టిదనిన ॥ 42**

**తా॥ ఇంక ఇతి॥** ఇక గురుచార రాశిఫలమును చెప్పుచున్నాను వినుము.

## గురుచారము

**క. తగరుపయి గురుఁడు నిలిచిన । నగణితమగు వానగుఱిసి యజములు జచ్చున్ ।**
**నగములపయి నవధాన్యము । లొగిఁ బండునటం జెప్పి రొప్పుగ నార్యుల్ ॥43**

**తా॥ తగరు ఇతి ॥** మేషమునందు గురుడు ఉండినట్టయిన ఆసంవత్సరము వర్షములు సమృద్ధిగా గురియును. పర్వతములమీద అనగా ఎత్తయిన గట్టినేలలయందు నవధాన్యములును పండును. మఱియును ఆయేడు మేకలును, గొఱ్ఱెలును నశించునని తా.

**క. పోతుపయి గురుఁడు నిలిచిన । భూతలమునఁ గఱవుపుట్టి పొలియుదు రాజిన్ ।**
**ఖ్యాతముగ దుష్టకష్టము । లాతతమగు నీతిబాధ లధికము జేయున్ ॥ 44**

**తా॥ పోతు ఇతి ॥** గురుడు వృషభమునందుండెనేని ఆసంవత్సరము వర్షములు కురియక కఱువుచేతను, యుద్ధములు చేయుటచేతను జనులు అధికముగా జత్తురు. అనేక దుర్మార్గ కార్యములవలన జనులు కష్టములను అనుభవింతురు. మఱియును దేశమునందు ఈతిబాధలుమెండుగా నుండునని తా.

**క. పశుభీతి ప్రజకుమేలగు । వసుమతి వర్షంబుగురియు వనితలకెల్లన్ ।**
**శిశువులు పుట్టుదు రర్థిన్ । ఎసఁగఁగ సురమంత్రి మిథునమెక్కినయేటన్ ॥45**

**తా॥ పశు ఇతి ॥** గురువు మిథునమునందు ఉండిన సంవత్సరము పశువులకు భయము కలుగును. జనులు శుభములను పొందుదురు. భూమియందు సమృద్ధిగా వర్షము కురియును, జనవృద్ధి అధికముగా నుండును, అనగా కానుపులు మెండగునని తా.

**క. సంతోషముడిగి జనములు । కాంతలగొని యెల్లదిశల కరుగుదు రర్థి ।**
**న్నెంతయు గీడగుఁ బుడమికి । నెంతయు సురమంత్రి యెండ్రనెక్కిన నయేఁటన్॥46**

**తా॥ సంతోష ఇతి॥** గురువు కర్కాటకమునందుండు సంవత్సరము జనులు విచారముతో ఆలుబిడ్డలను వెంటబెట్టుకొని అన్నములేక అన్నివైపుల అనగా ఊరూరుకు పోవుదురు. దేశమునకు మిక్కిలి కష్టము కలుగునని తా.

**క. సురగురుఁడు సింహమెక్కిన । నరవరు లాహవములోన నలియుదు రపుడా ।**
**ధరణీప్రజలకు గీడగు । బరమార్థము జొన్నతప్ప బండవుపంటల్ ॥ 47**

**తా॥ సురగురు ఇతి ॥** గురువు సింహము నందున్న సంవత్సరము రాజులు యుద్ధములలో మడియుదురు. అనగా యుద్ధములు అధికముగా నుండును. ఆసమయమున ఆదేశమునందలి జనులు అమితమైన నష్టములు కష్టములను పొందుదురు. జొన్నలుతప్ప తక్కిన పంటలు ఏవియును ఆసంవత్సరము పండవని తా.

**క. కన్యపయి గురుఁడు నిలిచిన । నన్యాయములేక ప్రజల యభివృద్ధియగున్ ।**
**జొన్నలు కూరకు నొల్లరు । జన్నములొగి విప్రవరులు సమకూర్తురిలన్ ॥48**

**తా॥ కన్యపయి ఇతి ॥** గురువు కన్యారాశియందు ఉండు సంవత్సరము ఏవిధములైన అన్యాయములులేక జనులు చక్కగా నభివృద్ధినొందుదురు. పంటలు అన్నియును సమృద్ధిగా పండును. బ్రాహ్మణశ్రేష్ఠులు అనేక యజ్ఞములను చేయుదురని తా.

**క. త్రాసుపయి గురుఁడు నిలిచిన । భాసురమగు వానగురియుఁ బంటలు పండున్ ।**
**భూసురులకు బ్రమదంబగు । ధీసన్నుత జగములందు దిరమయి యుండున్ ॥49**

**తా॥ త్రాసు ఇతి॥** ఓసాంబమూర్తీ! తులయందు గురుడు ఉండు సంవత్సరము మంచి వర్షములు కురియును, పంటలు చక్కగా బండును. బ్రాహ్మణులకు సంతోషము కలుగును. జనులందఱును నిర్విచారముగ కడుపులోనిచల్ల కదలకుండ నుందురని తా.

**క. తేలుపయి గురుఁడు నిలిచిన । నాలంబున భూమిపోవు నగగద! తఱుఁగున్ ।**
**వెలిభూమి కఱవుపాలగు । గాలం బెల్లపుడు జెష్ట గడచుచునుండున్ ॥ 50**

**తా॥ తేలు ఇతి ॥** పర్వతము గదగా గల ఓసాంబమూర్తీ! గురువు వృశ్చికమునందు ఉన్నట్టయిన యుద్ధమునందు దేశము శత్రురాజుల పాలగును. బయటిదేశములోగాని తెల్లనిదేశమునందుగాని క్షామము చేత జనులు సదాకష్టములు అనుభవించుచుందురని తాత్ప.

**క. వింటిపయి గురుఁడు నిలిచినఁ । బంటలు గడుదేలిపోవు బ్రత్తియు నువ్వుల్ ।**
**అంటువడు నెల్లభూముల । నొంటక భూమీశులెల్ల నుర్విం గడతుర్ ॥ 51**

**తా॥ వింటిపయి ఇతి॥** గురుడు ధనూరాశియందు ఉండినట్టయిన పంటలు చక్కగా ఫలింపక తేలిపోవును. పాతిక పరక పంటలు మాత్రమే పండునని భావము. ప్రత్తియును, నువ్వులును, సకల ప్రదేశములయందును చెడిపోవును. రాజులు ఈర్ష్యాళువులయి సంగరములందు మడియుదురని భావము.

**క. మకరిపయి గురుఁడు నిలిచినఁ । బ్రకటముగా వానగురియు బంటలు పండున్।**
**సకలమున జొన్నలధిక ము । లకలస్థితితోడ వాన లలుగులు ముంచున్ ॥52**

**తా॥ మకరి ఇతి ॥** గురుడు మకరరాశియందున్నట్టులైన చక్కగా వర్షములు కురియును. పంటలుగూడ చక్కగా ఫలించును. మొత్తము మీద జొన్నల పంటలు అధికముగా నుండును. వర్షములు కురిసి ఎక్కడచూచినను వెల్లువలు (ప్రవాహములు) గానుండునని తా.

**క. కడవపయి గురుఁడు నిలిచినఁ । దడయక వర్షంబు గురియు ధారుణియందున్।**
**బుడమి సుభిక్షము నొందును।నడరఁ దటాకములు నిండి యలుగులు వాఱున్ ॥53**

**తా॥ కడవ ఇతి ॥** గురుడు కుంభరాశియందు ఉండినట్టయిన, తప్పక దేశమునందు వర్షములు కురియును, మఱియు చెఱువులు నిండి వెల్లువలు పాఱును. పంటలు సమృద్ధిగా బండి దేశము సుభిక్షముగా నుండునని తాత్పర్యము.

**క. మీనమున గురుఁడు నిలిచిన । మానుగ జొన్నలును బ్రత్తి మహిలోఁ గలుగున్ ।**
**భూపతులు ప్రజల బ్రోతురు । వానలు మధ్యంబులగును వసుమతిమీఁదన్ ॥54**

**తా॥ మీనము ఇతి ॥** ఓ సాంబమూర్తీ! గురువు మీనరాశియందు ఉండినట్టయిన భూమియందు ప్రత్తియును, జొన్నలును, సమృద్ధిగా పండును. రాజులు ప్రజలను, తాముకన్న

బిడ్డలనువలె చక్కగా కాపాడుదురు. వర్షములుమాత్రము మధ్యమపక్షముగా అనగా నడితరముగా కురియునని తా.

[3]క. కరినగ దినకర శక వ
త్సరములు భువిఁ బరఁగు చుండ సస్యానందం
బిరవుగ శ్రీగిరినాథున
కరుదుగ రచియించె దోనయామాత్యుఁడిలన్.

గద్య : ఇది సకలజనస్తుత్య దోనయామాత్య ప్రణీతంబైన
సస్యానందంబున సర్వంబును
చతుర్థాధికారము.

గద్యము. ఇట్లు భారద్వాజస గోత్రోద్భవుండును, సంగవంశపయః పారావార
రాకాసుధాకరుండును, శంభుముని పౌత్రుండును, లక్ష్మణావధాని
ద్వితీయ పుత్రుండును, భగవద్గీతాభాష్యార్థచంద్రికాద్యనేకగ్రంథకర్తలగు,
బ్రహ్మశ్రీ నోరి – గురులింగశాస్త్రులకుఁ బ్రియశిష్యుండునగు,
సంగ – శేషాచలశాస్త్రి విరచితంబగు నాంధ్రతాత్పర్య సహితమైన
సస్యానందంబను వర్షశాస్త్రము చతుర్థాధికారము సర్వము
సంపూర్ణము.
ఓం తత్సత్ శ్రీపరమేశ్వరార్పణమస్తు.



1. సంహారము (పూ.ము.పా.)
2. మణిమంజరి (పూ.ము.పా.)
3. పూర్వముద్రణలలో ఈ పద్యము లేదు.